# శ రిత్రి ష్ఠ

## శ్రవ్యనాటికలు

(గేయాత్మకములు)

స్వర్ణోత్సవ సంపుటాలు :

కృష్ణపక్షము
పల్లకి
శర్మిష్ఠ
ధనుర్దాసు
తిరుప్పావై
మేఘమాల

# శర్మిష్ఠ

దేవులపల్లి
వేంకట కృష్ణశాస్త్రి

నాటికలు



దేవులపల్లి కృష్ణశాస్త్రి
సన్మానసంఘ ప్రచురణ

*SARMISHTA*

*Krishna Sastri's Plays*

(All broadcast by
All India Radio)



Golden Jubilee
(First) Edition :
January 1975

Published by
DEVULAPALLI KRISHNA SASTRI
SANMAANA SANGHAM, MADRAS.

Printed at
FREEDOM PRESS,
Madras-600021.

Cover Design :
BUJJAI

Price :
Rs 8-00

ప్రాప్తిస్థానం : కృష్ణశాస్త్రి సన్మానసంఘం
ప్రచారకార్యాలయం,
14. సుంకురామచెట్టి స్ట్రీట్.
మదరాసు-1.

ఆత్మీయుడూ

ఆప్తమిత్రుడు

శ్రీ బెజవాడ గోపాలరెడ్డికి

మనది ఒకేఒక సంస్కార సమాజం - మనం ఒకేరకపు సాహితీకుటుంబంలో వారం, గురుదేవుని అంతేవాసులం - కనుక దగ్గరచుట్టాలం.

ఈ చుట్టరికం దాదాపు అర్ధశతాబ్దినుంచి నిలబడి వస్తూంది. నా పద్యాలంటే, గేయాలంటే మీ కెంత ఇష్టమో నాకు తెలుసు, మీకు తెలుసు. మీ రెట్టి రసజ్ఞులో, కవులో నాకు తెలుసు.

మీరు పోరగా పోరగా ఇప్పటికి ఇవిగో శర్మిష్ఠ మొదలైన నా నాటికలు!

ఇందులోని నాటికలు :

శర్మిష్ఠ

కృష్ణాష్టమి

యమునావిహారి

ఏడాదిపొడుగున

గౌతమి

వేణుకుంజం

# కవితా స్వర్ణోత్సవం

శ్రీ కృష్ణశాస్త్రిగారికి 77 నిండాయి. అయితే వారి కలానికి ప్రౌఢయౌవనం వచ్చిందిగాని, వృద్ధాప్యం రాలేదు. వయసు పైబడుతున్న కొద్దీ వారి మనసుకు వైశాల్యం, భావనకు పదను పెరుగుతున్నాయి. ఆయన వ్రాసిన ప్రతి వాక్యంమీద, ఆయన ప్రత్యేకముద్ర ఉంటుంది. తెలుగు నుడికి జిలుగూ వెలుగూ సంతరించి, తెలుగుకవితను క్రొత్త పుంతలు త్రొక్కించిన వైతాళికులలో శాస్త్రిగారు ప్రముఖులు. భావకవితోద్యమానికి వారు ప్రవక్తలు. ఆ నవ్య కవితారీతికి ఒరవడి వారి 'కృష్ణపక్షము.'

'కృష్ణపక్షము' 1925 లో వెలువడింది. ఇప్పటికి 50 ఏండ్ల క్రితం. ఒకవిధంగా ఆ ప్రచురణ నవ్యకవితకు నాంది. అందువలన, 1975 కృష్ణశాస్త్రి కవితకే గాక, ఆధునిక కవితావిర్భావానికి స్వర్ణోత్సవ వత్సరం. ఈ సంవత్సరాన్నే ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం "తెలుగు సంస్కృతి వికాస వత్సరం"గా ప్రకటించి ఉండడం ఒక విశేషం — ఆ కారణంచేత శ్రీ శాస్త్రిగారిని తగువిధంగా సత్కరించాలని

కొందరు మిత్రులం, ఆరాధకులం, కలిసి, ఒక సన్మాన సంఘంగా ఏర్పడ్డాం.

కవిసత్కారం అనేకవిధాలు. వెనుకటి యుగంలో రాజులు, జమీందార్లు, తమ ఆస్థానాల్లో పండితసమక్షంలో వారిచేత కవితాగానం చేయించి, వారికి, మెచ్చుకోలుతో పాటు, ధనకనక వస్తువాహనాలు సమర్పించి గౌరవించే వారు. 'రాజయుగం' పోయింది. 'ప్రజాయుగం' వచ్చింది. రచయితలను కొంతవరకు కేంద్రప్రాంతీయ ప్రభుత్వాలు ప్రోత్సహిస్తున్నాయి, గౌరవిస్తున్నాయి. రసజ్ఞులైన పౌర ప్రముఖులు అక్కడక్కడ కవులకు, కథకులకు, పండి తులకు, నాటకకర్తలకు సన్మానాలు ఏర్పాటు చేస్తున్నారు. పూలమాలలు, దుశ్శాలువలు మొదలుకొని, 'పర్సు'లవరకు సమర్పించి రచయితల యెడల తమ గౌరవాదరాలు తెలియ పరచుకుంటున్నారు.

శ్రీ కృష్ణశాస్త్రిగారిని, ఈ స్వర్ణోత్సవసందర్భంలో ఏవిధంగా సత్కరించాలన్న ప్రశ్న చర్చకు వచ్చింది.

తెలుగు సాహిత్యరంగంలో విలువలు తారుమారయి పోతున్న ఈ దినాలలోకూడా, మారని విలువ శ్రీ కృష్ణ శాస్త్రిగారు. వారి సినీమాపాటలకుకూడా సాహిత్యగౌరవం ఉంది. అయితే వారి 'కృష్ణపక్షము - ప్రవాసము - ఊర్వశి' గాని, ఆ తరువాత రచించిన వందలాదిపద్యాలు, భావగీతాలు, పాటలు, రేడియోనాటికలు, యక్షగానాలు, ప్రసంగాలు, వ్యాసాలుగాని ఈనాడు తెలుగునాట గ్రంథాలయాలలోనైనా

దొరకవు. అభిమానులనోట ఏ వేదికపైననో, ఏ సుహృద్గోష్ఠిలోనో విని ఆనందించడమేగాని, పుస్తకరూపంలో వారి అపురూప రచనలు రసజ్ఞులకైనా అందుబాటులో లేవు. ఈ కొరత కొంతవరకైనా తీర్చాలని, సుమారు పది ఏండ్ల క్రితం, కావలి విశ్వోదయవారు, కృష్ణశాస్త్రిగారి వచన రచనలలో కొన్నింటిని మూడుసంపుటాలుగా ప్రచురించారు. వారి మిగిలిన రచనలలో ఎన్ని సాధ్యమైతే అన్ని పుస్తక రూపంలో, స్వర్ణోత్సవ సమర్పణగా తెలుగుదేశానికి అందించాలని, సన్మానసంఘం నిశ్చయించింది. తత్ఫలితమే ఈ కృషి.

శ్రీ కృష్ణశాస్త్రిగారికి పూలమాలలు, శాలువలు, ప్రశంసలు, ఈవరకు ఎన్నో సన్మానసభలలో లభించాయి. ధనవిషయంలో కూడా వారికి లోటులేదు. ప్రతి తెలుగు ఇంట, వారి రచనలు పుస్తకరూపంలో అందించగలిగితే, కృష్ణశాస్త్రిగారి యెడల మాకు గల భక్తిగౌరవాలు వ్యక్త పరచడమేగాక, తెలుగుసాహిత్యానికి ఓపినంతవరకు సేవ చేసినట్లవుతుందని సన్మానసంఘం భావిస్తోంది. ఈ ప్రచురణలు రసజ్ఞులందరూ అభిమానంతో కొని, మా కృషికి తోడ్పడతారని మా ఆశ -

ఇట్లు,

మద్రాసు
జనవరి, 1975 } దేవులపల్లి కృష్ణశాస్త్రి సన్మానసంఘం

# దేవులపల్లి కృష్ణశాస్త్రి సన్మానసంఘం

*కన్వీనర్లు :*

శ్రీ ఎమ్. ఆనందం, M. P.

శ్రీ పి. వి. రమణయ్య (రాజా)

*ఆర్గనైజింగ్ కమిటీ :*

డా॥ పి. వి. రాజమన్నారు

పద్మభూషణ్ డా॥ ఎమ్. వెంకటరంగయ్య

డా॥ బి. గోపాలరెడ్డి

శ్రీ ఎస్. బి. పి. పట్టాభి రామారావు. M. P.

పద్మభూషణ్ డా॥ బి. యన్. రెడ్డి

పద్మవిభూషణ్ డా॥ శ్రీమతి దుర్గాబాయి దేశముఖ్

శ్రీ నార్ల వేంకటేశ్వరరావు

శ్రీ ఎ. ఎస్. రామన్

శ్రీ బి. కృష్ణమూర్తి

శ్రీ పి. బ్రహ్మయ్య

శ్రీ యం. యస్. రావు

శ్రీ బి. రజనీకాంతరావు

శ్రీ డి. రామచంద్రారెడ్డి

శ్రీ ఎస్. ఎమ్. వై. శాస్త్రి

శ్రీ ఎమ్. ఎస్. రెడ్డి

శ్రీ విద్వాన్ విశ్వం

శ్రీ డి. సీతారాం

శ్రీ గోరాశాస్త్రి

శ్రీ ఎ. కె. ఎస్. రావు

శ్రీ ఎమ్. వి. శాస్త్రి

శ్రీ విజయరాఘవరావు

శ్రీ డి. ఆంజనేయులు

శ్రీ తారకం

శ్రీ టి. వి. కె. శాస్త్రి

శ్రీ ఎ. రామబ్రహ్మం

శ్రీ వాకాటి పాండురంగరావు

*ట్రెజరరు :*

శ్రీ ఆర్. కె. రావు

*అభినందన సంచిక కూర్పు :*

శ్రీ పాలగుమ్మి పద్మరాజు

# నా మాట

## 1

ఏ నాటివో ఈ నాటికలు!

ఎప్పటివో గాని ఈ పద్యాలూ, పాటలూ

ప్రసంగ వ్యాసాలూనూ!

ఎప్పుడెపుడో గిలికినవీ బరికినవీని.

దూరాన నుంచి వెన్నంటి వచ్చాయి. ఎవరో చిరపరిచితుడైన

బాటసారి పదధ్వనులు లాగున - నన్ను వదలకుండా!

## 2

మా అన్నగారు శ్రీ శివశంకరస్వాములు నా 'కృష్ణపక్షము' 1925 లో అచ్చు వేయించేసేరు. అప్పటికి ఆయనకు అందిన నా పద్యాలన్నీ - కొన్నిటిని వదలివేయాలని నే నంటున్నా వినక - ఒక ధోరణిలో కూర్చి. తమ సింహావలోకనంతో ముద్రింపించేసేరు. 50 ఏళ్ళు అయింది. అలాగే నా సోదరుడు ముద్దుకృష్ణ 'ప్రవాసము-ఊర్వశి' అనే గ్రంథాన్నిని - 1929 లో. ఎవరో ఒకరు తామే పట్టు పట్టి పూనుకుని చేయించాలి, నా చేత ఏ మంచిపని అయినా.

దాదాపు పాతిక సంవత్సరాలక్రితం ప్రారంభం - నా రచనలు అచ్చువేయించి తీరాలని ఆప్తులు ఒత్తిడి చేయడం. ప్రాణాధికులైన కాటూరి వేంకటేశ్వరరావు, మరిపాలగుమ్మి పద్మరాజు, ఎస్. బి. పి. పట్టాభిరామారావు, ఎమ్. ఆర్. అప్పారావు, నార్ల వేంకటేశ్వర రావు మొదలైనవారు - అచ్చుకాని నా రచనలన్నీ పుస్తకరూపాన ప్రకటించా లంటూ గట్టిగా పట్టుకునేవారు. ఇక నా ఆప్తమిత్రులు బెజవాడ గోపాలరెడ్డికి కనబడడం భయం- 'యేవండీ పుస్తకాలు?' అని మొట్టమొదటి ప్రశ్న. అయినా పదుగురిలో వీనిని పడవేయడం పడలేదు.

## 3

ఏదో బెదరూ, భయం!
వల్ల మాలిన బద్ధకమూ.
కొంతవరకు, జమీందారీ సావాసంవల్ల వచ్చిన ఉపేక్ష కూడాను.

తరుముకు వచ్చిన ఏ రేడియో ప్రోగ్రాంకో ఆ సమయానకు, గబగబ ఏ రజనీకాంత రావుకో, శివరామా రావుకో, కురిమెళ్ళ వేంకట రావుకో నేను చెప్తుంటే వ్రాసినవీ, లేదా ఏ ప్రయాణంలోనో, నడుస్తూనో చిన్నచిన్న కాగితాలమీద వంకర టింకరగా గీసినవీ రక రకాల రచనలు ఇవి.

మరి అచ్చు వేయించాలంటే తిరిగి ఒకసారి చదువుకోవాలి-సంస్కరించాలి - సాధ్యమైనంతవరకు ఏ లోపమూ లేకుండా నిర్మించాలి - ఇది నా సంకల్పం. పద్మరాజు నిర్మొగమాటి. ఉచ్చితంగా 'ఇది బాగుంది, ఇది బాగా లేదు' అని చెప్పేస్తాడు - ఎవరి రచన అయినా సరే! గొప్ప మేధావీ, సాహిత్య రసవేత్త, రసజ్ఞుడు - అతగాడే వీనివి వేయమంటున్నాడే!

ఇంతలో మూగతనం వచ్చిపడింది నాకు.

Grow old along with me అని బ్రౌనింగు చాలా ఉల్లాసంగా అన్నప్పటికీ, ముసలితనం చెడ్డది.

ముసలితనంలో మూగతనం భయంకరం - శిథిలమందిరంలో అంధకారం లాగున.

ఏదో తోచేస్తున్నాను బ్రతుకు - 'దినములు పరస్పర ప్రతి ధ్వనులుగాగ' - అనాటి మా వేదుల లాగున.

I am like the road in the night listening to the footfalls of its memories in silence అని రవీంద్రు డన్నట్లు-

'దీపకాంతిలో కిటికీ
దిగువ నెవ్వరా గోష్ఠి?
నేను - నా నీడ'

అని నళినీకాంతరావు అన్నట్లు.

## 4

ఇలా ఉండగా 1964 లో నా ప్రాణమిత్రుడు దొర్ల రామ చంద్రారెడ్డి హైదరాబాదు వచ్చి నా వచనరచనలు కొన్నిటిని తమ్ముడు ఇంద్రకంటి హనుమచ్ఛాస్త్రి చదువుతుంటే విని, నా వైపు చూడ కుండా, వానిని అలాగే పట్టుకొనిపోయి, కావలిలోని విశ్వోదయ సంస్థద్వారా అచ్చు వేయించేసేడు—నాకు మాత్రం ఎందుకో నా వచన రచనలు నా పద్యాలకీ గేయాలకీ తీసిపోవు అనిపిస్తుంది.

అయితే, పద్యాలూ, ఎన్నో గేయాలూ, నాటికలూ, యక్ష గానాలూ, వ్యాసాలూ ఉండిపోయాయి.

## 5

ఇంతలో ఒకాయన నా జీవితంలో ప్రవేశించాడు, చీకటింటి కిటికీల్లూ తలుపులూ తీసి వసంతకాలపు ప్రభాతవాయువు లాగున. ఈయన ఎవరిద్వారా విన్నాడో నా సంగతీ, నా రచనల సంగతీని:- నాతో అనలేదు, నన్ను అడగలేదు - ప్రముఖులూ పెద్దలూ అయిన కొందరితో సంప్రతించి ఒక సంఘం ఏర్పరచాడు - నా ప్రియసోద రుడు మామిడిపూడి ఆనందం తనకన్నా ఉత్సాహంగా, పట్టుదలతో ఉన్నాడని - అంతే కాదు, నా పరమగురువులు వెంకటరంగయ్యగారు కూడా ఆదేశించారనీ, తమ యత్నాన్ని ఆశీర్వదించారనీ అన్నాడు -

ఈయన శ్రీ పి. వి. రమణయ్య- స్నేహితులం అందరమూ 'రాజా' అంటాము. 'నేనేమీ చదువుకోలేదు, నా కేమీ తెలియదు' అంటూంటాడు. అదేమో నాకు తెలియదుగాని, అతనికి ఒక వింత సంస్కారం ఉంది, ఆతని మూర్తికి సుకుమారమైన ఏదో పరిమళం వంటిది ఉంది; నన్ను చాలా గాఢంగా ఆకర్షించింది -

కాగితాలధర భయంకరంగా ఉన్న ఈ రోజులలో కొన్ని సంపుటాలకు సరిపోయే కాగితం కొని ముందే తెచ్చేశాడు. ఎవ్వరూ చేయని పని, చేయలేని పని ఈయన చేసేశాడు.

ఈయనకు మరొకరు తోడయ్యారు, అసాధ్యుడు, శ్రీ యం. యన్. రావుగారు. అచ్చు వేయించేభారం తనమీద వేసుకున్నాడు-

అసలు, అచ్చుగాని తెనుగుగ్రంథం ఈయనకు అందడం భయం !- ఎంత అభిమానం నా యెడ ఉంటే, ఎంత మక్కువ ఆంధ్రసాహిత్యం మీద ఉంటే, అంత పనుల ఒత్తిడిలో, ఈయన ఈ పనికి పూను కుంటాడు !

ఇద్దరూ కలిసి నావద్ద ఉన్న రచనలను - చిత్తు కాగితాలనూ, చిల్లర పీలికలనూ-పట్టుకొని వెళ్లిపోయారు.

వీరికి ఎంత శ్రమకలిగించానో ! కృతజ్ఞుణ్ణి అని వేరే చెప్పి వీరికి అన్యాయం చేయను.

మరి - రాజాకీ, యం. యన్. రావుగారికీ నాకూ మధ్య, వళినికీ నాకూ మధ్య ఆసులో కండెలాగున తిరుగుతూ, మిత్రుడు శ్రీ ఆర్. కె. రావు, తన పనులన్నీ మానుకుని తెగ కష్టపడుతూ, నన్ను విశ్రాంతిగా ఉండనీయక తాను విశ్రాంతి తీసుకోక, బాకీ వసూలుచేసే కాబూలీ లాగున నన్ను పట్టుకుని ఈ పని అంతా నడి పిస్తున్నాడు.

ఇక చిరంజీవి నళినీకాంతరావు మహాకవి కుమారుడు. తానే మంచికవి, సాహిత్యవేత్త, బాగా చదువుకున్నవాడు - నా యెడ గాఢానురాగం అతనికి. నా మేనల్లుడు వింజమూరి శివరామారావు ప్రెస్సుకాపీలు తయారుచేసిపెట్టగా, తాను సంపాదకబాధ్యతలు పైన వేసుకొని, ప్రూఫులు తానే పట్టిపట్టిచూస్తూ, అవసరమైన మంచి దిద్దు బాట్లు చేస్తూ చెప్పలేనంత శ్రమ పడుతున్నాడు.

ఈ గ్రంథాలకు ముఖచిత్రాలు వేసినవాడు నా కుమారుడు చి॥ బుజ్జాయి అనే సుబ్బరాయశాస్త్రి.

వీడూ, చిరంజీవి నళినీ నూరేళ్ళు హాయిగా వర్ధిల్లాలి.

వీరందరికీ - ఎందరికో - నా యెడ ఈ అకారణమైన అనురాగం ఎందుకో !
అందరికీ కృతజ్ఞుణ్ణి.

కృష్ణశాస్త్రి

# ప్రశంస

"చిన్నన్న ద్విపద కెరగును
పన్నుగ పెద తిరుమలయ్య పదమున కెరగున్
మిన్నంది మొరయు నరసిం
గన్న కవిత్వంబు పద్య గద్య శ్రేణిన్।"

అని చాటువుగా పలికిన తెనాలిరామకృష్ణునినాటికే ద్విపదకు అధమ స్థానమూ, పదమూ లేక గేయానికి మధ్యమస్థానమూ, పద్యగద్య కవిత్వానికి 'మిన్నంది మొరయు' ఉత్తమస్థానమూ సాహితీపరుల హృదయాలలో నెలకొని ఉన్నాయి. తాళ్ళపాక అన్నమాచార్యులూ, ఆయన కుమారుడు పెద తిరుమలయ్యా అందుకొని ఎత్తి ఉండక పోతే గేయానికి వారికి ముందుకాలంలోలాగ మధ్యమస్థానంకూడా వచ్చిఉండేది కాదేమో అనిపించడం సహజం. అలాగే ఆధునిక సాహితీపరులలోకూడా, పద్య గద్య కవిత్వానికి కంటె గేయకవితకు గౌరవం సాధారణంగా కొంత 'నాసి' అనే చెప్పాలి. పద్య గద్య కవితతోపాటు గేయకవితా ప్రక్రియనుకూడా అవలంబించి గేయకవితకు కూడా అదే స్థాయిలో ఎత్తైన పీట వేయించుకున్న ఘనత చాలా కొద్ది మందికే దక్కుతుంది. ఆ కొద్దిమందిలో ఒకరు శ్రీ కృష్ణశాస్త్రి.

పద్య గద్య గేయాలతోకూడిన కృష్ణశాస్త్రిగారి నాటికా సంపు టాలు రెండు (గేయాత్మకముల దొకటీ, భక్తిరసాత్మకముల దొకటీ) మిగిలిన మరికొన్ని సంపుటాలతోపాటు స్వర్ణోత్సవ సమ ర్పణగా వెలువడుతున్నాయి. అసంఖ్యాకులయిన 'కృశా' సాహిత్య పిపాసువులకు ఇది శుభవార్త.

'రేడియో' అనేది పుట్టిఉండకపోతే, అందులో మొదట తన అభిమానులూ స్నేహితులూ కార్యనిర్వాహకులుగా పనిచేస్తూ, తన

చేత బలవంతాన రాయించి ఉండకపోతే తను అసలు నాటకాలు రాసి ఉండనేమో అని అంటూంటారు శాస్త్రిగారే. ఆయన స్వతహా ఉత్తమ శిల్పంలో కమ్మని పద్యాలు చెక్కగల ప్రథమశ్రేణికవులలో ఒకరు. నన్నయ శ్రీనాథాదుల నాటినుంచీ సానదేరి రూపుదిద్దుకొన్న తెలుగు పద్యపు బాణీలు ఆయనకు కొట్టిన పిండి. ఆయనే ఒక Perfectionist కావడాన మంచిదో చెడ్డదో ఆయనకు ఒక గుణం ఉంది - ఎంత పెద్దగా పేరుమోసినకవి పద్యమైనా పాటయినా ఆయనముందు పెడితే, 'ఆ మాట తీసివేసి ఈ మాటవేస్తే ఆ పద్యం (లేదా పాట) అంతకంటే ఇంకా బాగుండేది'-అనడం. అందుకే తాను రాసినవికూడా ఏ పత్రికకో అచ్చుకు వెళ్ళేదాకా, లేదా, రేడియోలో గాలిలో వెళ్ళేదాకా లేక సినిమాలో రికార్డు అయేదాకా తనపాటలోనో పద్యంలోనో మాటలు ఏవో కొన్ని ఎక్కడో ఒకచోట మరి కాస్త దిద్ది తీరిస్తేగాని ఆయనకి తృప్తి ఉండదు - అంతెందుకు, ఇప్పటికి సిద్ధమయి ప్రచురణ కాబోతున్న పాటలూ పద్యాలూ, ఇంకా ఎక్కడో ఏదో దిద్దుకోవాలనే తాపత్రయమే ఆయన్ని తన రచనలను ఇన్నేళ్ళుగా పుస్తకరూపంలోకి తీసుకు రానివ్వలేదన్నా అతిశయోక్తి కాదు. అంత పెర్ఫెక్షనిస్టు గనకనే తాను రేడియోకి రాసిన పాటలకయితేనేం, చివరికి సినిమాకి రాసిన పాటలకికూడా ఉత్తమ కవితాగౌరవం దక్కించగలిగినారాయన. ఈ పద్యం కృష్ణశాస్త్రిది, ఈ పాట కృష్ణశాస్త్రిది అని ఇట్టే పోల్చుకోవచ్చు. అవి ఆయన గేయ నాటికలలో పులకాంకురాలతో పరవశించేసే ఘట్టాలుగా రూపొందాయి.

ఆ మాటల యెంపికలో ఉంది ఆ మత్తుకూర్పే ప్రత్యేకత. ఆయన అసలు మాటకారి. ఎదటి మనిషినిగాని, సభనుగాని నిలబెట్టి అలా గంటలకొద్ది మాటలాడుతూనే ఆకట్టుకునే స్వభావం. అప్పుడు ఆ ఆడేమాటలనే ఇప్పుడు పాపం, కాగితంమీద తెగ రాసేస్తూంటారు. స్నేహితులూ, బంధుగులూ, అభిమానులూ, శిష్యులూ ఆయనకు ఎప్పుడూ దగ్గరగా ఉండాలి, లేకపోతే తానే వెతుక్కుంటూ

వాళ్ళదగ్గిరకి వెడతారు. అందుకే ఒకసారి నేనిలా అన్నాను ఆయన్ని గురించి—

"నీ తలపు వెలుగు కప్రము
నీ యెడద స్నేహసుధాపూర్ణ కనకసౌధవప్రము
నీ యెలుగు శ్రావణాభ్రము
అచంచల కారుణ్య చంచలాప్త జలదశుభ్రము"—

అని. నన్నయ్యనుంచి నేటివరకూ అందరి కవుల అందమైన తెలుగు పలుకుబడులూ ఆయనకి సొంతం. అంతే కాదు, బామ్మ మాటలలో తాతయ్య ఊసులలో, పాటకపుజనుల పలుకుల్లో కూలివాళ్ళ కూతలలో ఇమిడిఉన్న తెలుగుబాసకి జాత్యమయిన ప్రయోగాలను పట్టుకోడంలో ఆయన దిట్ట.

శర్మిష్ఠలో రాచకూతురి ప్రణయగీతలాస్యమూ, గుహుడిలో పడవవాని భక్తిపారవశ్యమూ, 'ఏడాసి పొద్దుగునా'లోను 'వేణుకుంజం' లోనూ తెలుగు పల్లీజనపు జీవితమాధుర్యాన్ని ఉట్టిపడేట్లు చేసే నుడికారపు సొంపులూ - ఔచిత్యం చెడకుండా, చవకబారు అనిపించకుండా ఎంత అందంగా ఎంత ఉదాత్తంగా చెప్పారూ అన్నట్లుగా ఉంటాయి.

ఆయనకుపూర్వం ఎందరో గేయకర్త లున్నారు. ఆయనకు సమకాలికులూ తరువాతివారూ ఉన్నారు. కాని, ఆయ నంతగా ఆలోచించి పరిశీలించి పరిశోధించి పాటకూర్చే రహస్యం, పాటకూర్పులోని అందాలను తెలుసుకున్నవారు చాలా తక్కువ. ఆయనా మొదటి ఖండకావ్యసంపుటాలలో మిశ్రఖండగతులలో సాగే మాత్రాగణాలతో నడిచే గేయాలను రాశారు. బ్రహ్మసమాజ ప్రార్థనలకోసం మహతి, కార్తికి అనే చిన్ని సంపుటాలలో రీతులను గతులను మార్చిమార్చి రాశారు. గాత్రం పోయేవరకూ ఆయన చేసే కవితాగానాలకు ఆంధ్ర దేశం అన్నిపక్కలా సాహిత్యసభలు ఉర్రూతలూగేవి. తనవే కాదు, గురజాడనుంచి తనదాకా ఆధునికకవు లందరి రచనలూ, నన్నయ

*

నుంచి తమ బాబయ్య, నాన్నగార్లదాకా పూర్వకవులందరి రచనలూ ఆ సభలలో మొదట గానమే చేసేవారు. గురజాడవారి ముత్యాల సరాలూ, పుత్తడి బొమ్మ వంటి కథాపదాలూ (ballads), నండూరివారి యెంకిపాటలూ, బసవరాజు అప్పారావుగారిపాటలూ, అడివి బాపిరాజుగారి పాటలూ ఇవన్నీ సంగీతపు ఊపు అంటీఅంటని రచనలనిపిస్తాయి. కృష్ణశాస్త్రిగారి ఖండకావ్యాలలోని మాత్రాగణ గేయాలు కూడా సాహిత్యపరుల పాటలే. అంటే వాటిలోని కవితాభాగం ఎక్కువ బరువు - దానికి పెట్టే సంగీతం పైగా చేర్చుకున్న ఒక తొడుగుమాత్రం అవుతుంది. అవికాక, శాస్త్రిగారు ఆ తరువాత రాసిన గేయాలూ గేయనాటికలూ అనసూయా సీతలనో, రజనినో (నన్నే), శ్రీ పాలగుమ్మి విశ్వనాథమునో, మల్లిక్కునో దగ్గర కూర్చోబెట్టుకుని, కొన్ని సందర్భాలకు తగిన సంగీతపువరుసలు పాడిస్తూ, ఆ వరుసలకు తగిన మాటలు కూరుస్తూ వ్రాసినవాటిలో గేయానికి కావలసిన సంగీతరచనలోని విశిష్టతా, సాహిత్యగౌరవమూ ఇవి రెండూ ఎలా ఉండితీరాలో అలా సమకూడుతూ వచ్చాయి. ఇలాటి రచనలన్నీ రేడియో ప్రారంభం అయాక వచ్చినవే. ఇప్పుడు సంపుటాలుగా వస్తున్న వాటిలోని వన్నీ అవే. వీటిలో సగానికి పైబడిన వాటితో నాకెంతో సన్నిహితసంబంధం వుంది.

స్వర్ణోత్సవ ప్రచురణలుగా ఇవి వెలువడుతున్నసందర్భంలో ఈ పరిచయ ప్రశంసావాక్యాలతో నా సంబంధాన్ని మరింత సన్నిహితం చేసుకొనే అవకాశం నాకిచ్చిన ప్రకాశకులకి నా కృతజ్ఞతలు :

రజని

# శర్మిష్ఠ

## మొదటి రంగము

[దూరాన్నుంచి అంత కంతకూ దగ్గరగా వస్తూ, నిలిచి నిలిచి ఉన్న రున్న రంటూ, పాడుతూ, హేమంతుడు వస్తాడు]

హేమంతుడు

ఏల ఇంత జాలి వీడు కోలు? నేడు నిలువ జాల!
ఆలసించి చేరనా నీహార దూర తీర వేల?
అలసి అలసి ఈ హసంతి కానలమ్మ నిదురించునో!
మలసి మలసి చేమంతి సుమాళి బాళి పలవించునో!
లోల మ్లాన లోధ్రసూన మేఖల దిగజారి సోలు!
తూలి తూలి నా ద్వీపటీ తుహినాంచలములు తేలు!
ఏస రేగు, ఎటుల మ్రోగు, ఈ ఈదరగాలి పిలుపు!
ఓసరిలెను కాటోలును ఉత్తరపుం గవను తలుపు!

[ఈదరగాలి గోల, దానితో కలిసి ఉన్న రున్న రంటూ దీర్ఘమైన నిట్టూర్పు]

దేవయాని

ఓసరిల్లిన తలుపు బాగా తీయవూ వాసంతికా! ఎవరి దీపాట? మన ముంగిలి వద్దకే వచ్చింది. తలుపు తీయవూ?

వాసంతి

అమ్మయ్యో! తీయను దేవయానీ! ఆపాదేవానిని నీవు చూడ లేదు. ఎంత ముసలివాడో! లోపలికి వస్తా దేమో!

దేవయాని

వాకిలిదాకా వచ్చినవాడు లోపలికీ వస్తాడు.

వాసంతి

రానీయను. తలుపు బిగిస్తా.

దేవయాని

అయ్యో. వెర్రిదానా! అంత వడిలిన శరీరంలోనూ ఎంత పట్టుదల ఉందో! తలుపు బిగించినా, లోపలికి రాగలిగినట్టు లేదూ?

వాసంతి

నీ మాటలు వింటే భయం వేస్తుంది.

దేవయాని

ఎందుకు? అతనిమూర్తి ఎంత చల్లగా, మోహనంగా, శాంతంగా ఉంది! ఎంత సంతృప్తి ఉందో అతని నిలువునా!

వాసంతి

ఆఁ! మరీని నీవు! మాపో రేపో మాయమైపోయే ముసలి వానికి సంతృప్తేమిటి? అన్నిసుఖాలూ, అనుభవాలూ సెలవు పుచ్చు కుని మళ్ళీ రాకుండా పోయాయి కదా అతని దగ్గరనుంచి! అది. నిస్పృహా? సంతృప్తా?

[హేమంతము పాట – 'అలసించి చేరనా నీహార దూర తీర వేళ']

దేవయాని

వాసంతీ! లోపలికి పెల్లగించి చూడలేవు నీవు! అతవి వార్ధక్యం, విశ్వాసం ఎంత అనుభవపరిపాకంతో, పాటవంతో భావి కాలంలోకి చల్లగా చూస్తున్న ట్లున్నాయో!

[వాసంతి నవ్వుతుంది]

ఏం? నామాటలు వింటే నవ్వ వస్తూందా?

వాసంతి

(నవ్వుతూ) ఏమిటో పెద్దమాటలు! భావికాలం, విశ్వాసం! (మళ్ళీనవ్వు)

దేవయాని

నవ్వకు వాసంతీ! నే నెన్నిసార్లో చూశాను దూర భావి కాలాలూ, అమరజీవనపు టంచులూనూ! కనుకనే నేనొక అచంచల విశ్వాసంతో బ్రతుకుకుంటూ వచ్చాను సుమా!

వాసంతి

దేవయానీ! అలా మాట్లాడుతున్నా వేం?

దేవయాని

ఏం?

వాసంతి

నీ మాటలు వింటే ఏదో దిగులు వేస్తుంది. నువ్వు బ్రతుక్కుంటూ రావడ మేమిటి? రెక్కలమీద ఎగిరిపోతూ వస్తున్నావు! మహారాజ్ఞివి.

[హేమంతము పాట : 'అలసి అలసి ఈ వాసంతి కానలన్ను నిదురించునో']

దేవయాని

నీకు కళ్లు లేవు తల్లీ! ఇందాకా చెప్పాను కదూ నువ్వు చూడలేవని? నాకేసి చూడు ఈసారి, విదానంగా! ఊఁ! నేనూ అందరిలాగే ఉన్నానా? నీలాగ? శర్మిష్ఠలాగ? మహారాజులాగ? ఈ నగరంలో ఎవరిలాగున అయినా ఉన్నానా? ఎప్పుడైనా? ఎందుకు తెల్లబోతావు చెప్పు! చెప్పు చెప్పూ! ఏం వాసంతీ?

వాసంతి

[నిట్టూర్చి] అవును దేవయానీ! నీ వా మునలివానివలె ఉన్నట్లున్నావు!- శాంతంగా, నిర్మలంగా, సంతృప్తిగా హేమంతంలో సరస్సులాగ! నిజమే సుమా! నీ కళ్లెప్పుడూ బయటికి పరుగెత్తవు, నాట్యం చెయ్యవు. నీ పెదవులు విరిగి విరిగి నవ్వవు. దేవయానీ! నీ చీరకూడా ఎంత గాలిలోనైనా చలించదు, వడకదు, నిన్ను చుట్టుకుని ఎంత నిశ్చలంగా శాంతంగా అంటిపెట్టుకుని ఉంటుంది!

దేవయాని

వాసంతీ! నేనూ మొట్టమొదట మీ అందరిలాగే ఉండేదాన్ని. విను వాసంతీ! ఈ దేవయాని అప్పుడే కుటీరప్రాంగణంలో లతలాగ నిలుచుంది. అప్పుడే అరుణకాంతుల్ని ఒత్తిగించుకుంటూ ఒక వసంతమూర్తి వచ్చి నిలబడ్డాడు. నేను అల్లల్లాడి పోయాను. ఉదయ మారుతంలో అతని దీర్ఘకుంతలాలు నల్లని సర్పాలలాగ ఊగిపోయి ఊగిపోయి పిలిచాయి. నా చూపులు కూడా ఊగిపోయాయి. నా హృదయమూ ఊరికే ఊగిపోయింది. వాసంతీ! అతని చేతిలో మధుభాండం

వైపు చెయ్యి చాపాను, నీకు కా దన్నట్లు అతను అటూ ఇటూ తల ఊపాడు. నాకళ్ళు తిరిగిపోయాయి. లోపల లోపల ఏదో అగాధం దొలుచుకొని పోయిన ట్లయింది. నేను కింద పడిపోకుండా ఎలాగ నిలబడ్డానో అప్పుడు! అతడు వెళ్ళిపోయాడు. నేను కింద ఎందుకు పడిపోలేదోగాని, అలాగే గృహాంతరాళంలోనికి వెళ్ళిపోయాను. నే నిప్పటికీ పడిపోలేదు వాసంతీ! అమ్మ! అమ్మ! [కొంచెం ఏడిచినట్లు]

[హేమంతమూ పాట: 'లోల మ్లాన లోధ్రసూన మేఖల దిగజారి సోలు']

వాసంతి

అయ్యో! వద్దు దేవయానీ వద్దు! వద్దు! ను వ్వలా కావద్దు!

దేవయాని

ఈవేళ న న్నేడవనీ ఒక్కసారి.

ఈలా గైనానా?
ఈలా గైనాన చెలీ! ఏ నాడైనా?
నాలో విషకీల దాచుకొన్నానే గానీ
లోన శోకశంకు వుంచి పైన నవ్వు పూయించి
లేనిహాయి నటియించుట ఎంత కషమే!
కాని– ఈలా గైనానా ఏ నా డైనా!
మానసమున చీకటిశిల పైన పీడకల
ఏ నాడును నిట్టూర్చక ఎపుడు కనులు చెమ్మగిలక
ఈ బ్రతు కిన్నాళ్ళీడ్చుట ఎంత కష్టమే!

వాసంతి

దేవయానీ! రేపు వసంతోత్సవం.

[హేమంతము పాట: 'ఏసరేగు, ఎటుల మ్రోగు ఈ ఈదర గాలి పిలుపు']

దేవయాని

వద్దు వసంతోత్సవం నాకు లేదు! నేను చల్లగా వెళ్ళిపోతాను.

వాసంతి

ఇప్పుడు ఎంత సుందరంగా కనపడుతున్నావు. మంచులో తడిసిన పారిజాతంలాగ! లోపల రక్తహృదయం, పైకి శాంత ధవళ మూర్తిన్నీ!

దేవయాని

వాసంతికా!

వాసంతి

అమ్మా!

దేవయాని

వాసంతీ!

వాసంతి

అమ్మా. వింటున్నా!

దేవయాని

వాసంతీ! నేను వెడుతున్నాను. ఆ ఉత్తరపు గవను తలుపు తెరు. అటు మృతసంజీవనికి దగ్గిర - తెరు ఆ ఉత్తరపు తలుపు!

[హేమంతము పాట: 'ఓసరిలెను శాబోలును ఉత్తరపుం గవను తలుపు']

# రెండవ రంగము

[వెనుకటి రంగంలోనుంచి ఈరంగంలో ప్రవేశించడానికి అనుకూలంగా ఏదైనా వీణావాద్యధ్వని]

శర్మిష్ఠ

తెరు మాధవీ, ఆ దక్షిణద్వారం!

[తెరచిన చప్పుడు]

మాధవి

ఎందుకో శర్మిష్ఠా? ఇన్నాళ్ళనుంచీ మూసి ఉన్నది ఇప్పుడు! ఓహో! మహారాజుమందిరం కనపడుతుం దనా?

శర్మిష్ఠ

ఔనే! మాధవీ: చూడవే. రాచనగరు ఇదివరకు దేవయాని మందిరంవైపు తిరిగిన ట్టుండేది కదే!

మాధవి

ఓహో! ఇప్పుడు ఇటు తిరిగిన ట్టుందో! అంతే కా దమ్మోయ్! ప్రభువు ప్రాసాదమూ, మన మందిరమూ, గవాక్షాలు కళ్ళల్లాగ తెరుచుకుని ఒకదానివైపొకటి చూస్తున్నా యిపుడు.

శర్మిష్ఠ

[నిట్టూర్చి] ఈమధ్య తరుచు అనిపిస్తుందే నాకు—

(సాకీ)

మూసిన తలుపేరో తోసినయట్లు
ప్రాసాదమున కవల ప్రమోసి అలికిడు లౌను!



అనుకోని ఒక అతిథి అరుదెంచునట్లు
అంతరంగములోన అడుగు సడు లౌను!

(పాట)

ఎన్నాళ్ళకు విన్నానే.

మాధవి

ఏ మని ? ఏ మని ?

శర్మిష్ఠ

ఆమని అరుదెంచు నని
స్వామిని కనుగొందు నని
ఇన్నాళ్లకు విన్నానే, ఏమో అనుకొన్నానే!

మాధవి

ఏ మని ? ఏ మని ?

శర్మిష్ఠ

ఈ ఎడబా టిక పో దని,
ఇక వేకువ రా దని,
నా కిక సుఖమే లే దని,
ఎన్నో అనుకొన్నానే!

మాధవి

ఏ మని ? ఏ మని ?

శర్మిష్ఠ

ఆ నడిచే అడుగులు ఆరామములో గాలి వని,
ఆ విరిసే పరిమళాలు అచటి తోటమాలి వని,
ఏమో అనుకొన్నానే, ఇన్నాళ్లకు విన్నానే!

(సాకీ)

ఒకపరి వేసగివలె కోపించును గానీ
ఒక్కసారి వానకారు మాదిరి ఏడ్పించు గానీ
ఒకపరి కార్తిక శశివలె హసియించును గానీ
ఇక హిమయవనికల దాగి విరసించును గానీ
ఏమైనా తానే నని, ఈనాటికి ఆమని యని
ఇన్నాళ్ళకు విన్నానే!

మాధవి

ఔ నమ్మా దేవీ! రేపే వసంతాగమం గదా! ఆ ప్రభువు అడుగుసవ్వడులు అంత కంతకూ దగ్గరగా వినబడుతున్నాయి కదా! ఇప్పు డెందు కమ్మా ఇంత అలజడి?

శర్మిష్ఠ

ఎంత బాధ చెలీ! అంతవరకూ మనసు నిలుపుట!
అంతు లేని నిరాశ కన్న అగాధ మైన నిశీథి కన్న
బతుకు బతు కంతా కన్నుల ఎదురుతెన్నులు చూచి
వేగుట

ఎంత బాధ చెలీ!

తనువుకన్నా మున్నె ఎదురుగ కనులు పరుగిడునే
కనులకన్నా మున్నె నిలువక మనసు త్వరపడునే
గాలిలో తలిరాకువలె
లోల వీణా తంత్రివలె
బేలయై ప్రియురాకకై ఊయాల లూగే మనసు నిలుపుట
ఎంత బాధ చెలీ!

## మూడవ రంగము

[యయాతి మందిరము – మళ్ళీ మరో వాద్యధ్వని]

యయాతి

మహామంత్రీ విన్నారా? ఈ పలితకేశం మా మనస్సుకు చాలా తొందర కలిగిస్తున్నది. రేపే వసంతోత్సవంకూడాను.

మంత్రి

మహాప్రభువులు కొంచెం నిదానంగా—

యయాతి

ఎందుకు నిదానం?

మంత్రి

ఈ మహారాజ్యభారం ఇంతకాలం ఇంత గొప్పగా వహించిన ఏలినవారికి నాలుగు శిరోజాలు నెరపినా నెరుస్తవి.

యయాతి

ఇంతేనా మీరు చెప్పగలిగినది?

మంత్రి

మనవిచేస్తా. మహాప్రభువుల కెన్ని బాధ్యత లున్నాయి! జైత్ర యాత్రలు నడిపించాలి. శత్రువుల్ని నిర్జించాలి. ప్రజను వేయికళ్ళతో రక్షించుకుంటూ రావాలి.

యయాతి

చాలు! మీ రేమంటారు భిషగ్వరులు?

భిషగ్వరుడు

ఇది-ఏది? ఈ శిరోజములు నెరయుట అనుదానికి మూల కారణము ఏ మైయుండ వచ్చునూ అని కొంతముందు ఆలోచించాలి.

యయాతి

అన్నీ ఆలోచించి తొందరగా మాత్రం చెప్పండి.

భిషగ్వరుడు

చిత్తం. వస్తున్నా. ఇదీ- ఏది? ఒక రుగ్మతే అయితే కొన్ని మూలికలు ఉన్నాయి. వార్ధక్యంవల్లనే అయితే - చిత్తం - సాక్షాత్తూ - శ్రీ ధన్వంతరులైనా ఏమీ చెయ్య లేరు అని ఖండితంగా చెప్పగలను.

యయాతి

సరే. ఆ మూలిక లేమిటి?

భిషగ్వరుడు

చిత్తం- ఏదీ? ఏలినవారి వయస్సు కాస్త పడమటి దిక్కునకు వాలుతూ ఉంది. కాబట్టి - చిత్తం - ఈవిషయమై అంత బాధ పడ నక్కర లేదు అనిపిస్తుంది.

యయాతి

[ఇష్ మని నిట్టూరుస్తూ] గురుదేవా!

గురుదేవుడు

మహారాజా! దీనికోసం ఇంత అలజడి న్యాయమా? ప్రకృతి ధర్మం ప్రకారం కొన్ని జరిగితీరుతవి. బాల్యయౌవనాలు దాటిన వాయెను. వార్ధక్యం వచ్చితీరుతుం దాయెను. ఈ శరీరమే అశాశ్వతం కదా! పరమార్థం తెలుసుకుని ఆ శాశ్వతపదవి ఏదో—

[కవి కూనరాగం తీస్తూ, పద్యం చదువుతూ వస్తాడు]

కవి

నా హృదయమందు విశ్వవీణాగళమ్ము
ఘోరు ఘోరున ఈనాడు మ్రోత వెట్టు
దశదిశా తంత్రు లొక్క సుధాశ్రుతిని పె
నంగి చుక్కలమెట్ల పై వంగి వంగి
నిలిచి నిలిచి నృత్యోత్సవమ్ముల చలించు.

మంత్రి

వస్తున్నాడూ కవి!

భిషగ్వరుడు

ఏమి టారాగాలూ, పద్యాలూ, ఇక్కడనా?

గురుదేవుడు

ఇతని కెప్పుడూ సమయమూ, స్థలమూ అంటూ లేదు.

మంత్రి

మహాప్రభువుల సన్నిధానంలోకి వస్తూనా ఈ కూనిరాగాలూ, ఈ వేషాలూ! ఇప్పుడా తాను రావడం, ఎప్పుడో ఏలినవారి వెల వైతే!

గురుదేవుడు

అన్నిటిలో ఎప్పుడూ ఇతగాడు ఆలస్యమే!

మంత్రి

తనబాధ్యత తెలుసుకుని అఘోరిస్తేనా?

కవి

వెలుగులో, అమృతాలో తావులో మరేవొ
కురియు జడులు జడులు గాగ పొరలిపారు
కాలువలు గాగ పూర్ణకల్లోలములుగ-
కలదు నాలోన క్షీరసాగరము నేడు

జయము జయము మహారాజునకు! మిత్రమా, వీ రందరూ ఏ ఆలోచనలు చెప్పారు?

యయాతి

ఏమీ చెప్పలేదు.

కవి

ఏమీ చెప్పలేరు! వారు వృద్ధులు, పెద్దలు, సజ్జనులు. ఇలా చూడు మహారాజా! నాదీ నీ వయస్సేనా? ఎలా ఉన్నానో చూడు! ఎప్పుడూ ముప్ఫయిఏళ్ళు దాటను. నేను చెప్పినట్లు చేస్తావా?

యయాతి

(అ. చెప్పు:

కవి

సరిగ్గా నేను చెప్పినట్లు చేయాలి. విను.

ఒక జాజి విరితీవ ఓవరియైనది
 తూరుపుకోన పూదోటలోన
రాగల పూర్ణిమా రజనీ ముఖాన, అ
 ద్దాన, శిరీషతల్పాన నొరిగి,
వేళోక యగుదాక విడియుమా అట, మేన
 తడి యైన నునుమంచు జడియు వాన
వలిపీవలి పిసాళివలి నలంగి, తొరంగి,
 వెన్నెలవెల్లిలో స్విన్న మైన
క్రొన్నన పరాగ మొక్కింత, కొంత క్రొత్త
బండిగురివెంద పూదేనె బాలచూత
రక్తపల్లవ పుటికలో రంగరించి
ఆరగించి వసంత వయస్వి వౌదు.

[మంత్రి మొదలైనవారు "భేష్ బా గుంది, బా గుంది" అని వికటంగా నవ్వుతారు]

కవి

ఇంక నీవు విసర్జించవలసినవి ఉన్నాయి. ఇవి జాగ్రత్తగా విను. కొంతకాలం దాకా వీళ్ళసహవాసం కూడదు; అనగా, మంత్రులూ వాళ్ళమంత్రాంగాలూ, భక్తులూ, పండితులూ, నీతిపాఠాలు చెప్పే

వారూ, వినయపరులూ, బాధ్యతాభారంతో భుజాలు వంగినవారూ, దీర్ఘముఖులూ—

మంత్రి మొదలైనవారు

సరి సరి! ఇదేమిటి ఈ ధోరణి?

[వింత నవ్వు నవ్వుతారు]

కవి

మహారాజా! కాస్త పిళ్ళని ఊరుకోమనాలి. మిత్రమా! ఇది చమత్కారం కాదు. సరిగ్గా నేను చెప్పినట్టు చెయ్యాలి.

యయాతి

అలాగే!

మంత్రి

మహాప్రభూ! ఒక్క మనవి!

యయాతి

ఇప్పుడు కాదు. మీరు వెళ్ళవచ్చు!

కవి

ఇంక ఉల్లాసంగా లేచి వసంతోత్సవానికి సన్నాహాలు చేయించవచ్చు.

దారి దొరకని నా గళద్వార సీమ
తరగహస్తాల పిలుపుతొందర విదల్చు
మోయలేనింక లోకాల తీయదనము
ఆలపింతు ఆనంద తేజోంబు నిధుల.

## నాలుగవ రంగము

[దూరాన్నుంచి దగ్గరగా వస్తూ పాడుతూ యువతీ యువకులు. ఒకదాని తరవాత ఒకటి సన్నాయీ, వీణా, వేణువూ, మృదంగమూ, మొదలైనవాని ధ్వనులు కొద్ది కొద్దిగా. ఆ ధ్వనులతో కలిసి ఆడ, మగ గొంతుల నవ్వులూ, రాగాలాపాలున్నూ.]

యువతీ యువకులు

కదలి పోవ గలము
బెదరి తిరిగి రాము
చదలు కడలి కలియు కడ, మా
బ్రదుకులు వికసించుపొద్దు.

ఆశలు కళ్ళాలు లేని గుర్రాలు
ఆనందమ్మే రథం యాత్రాపథం అనంతం.

గానమే ఉన్నంతవరకు
కాలమే ఉన్నంతవరకు
కడపల మా కందువరకు
తడసిపోము అడరిపోము!

తాత

[ఉస్సు రస్సు రనుచు]

ఏమిటి వీళ్లూ? తరుముతున్నారు నన్ను! ఏమి టీ వేషాలూ? ఆటలూ? వీళ్ళకి పని లేదు కాబోలు. అయ్యయ్యో!

[వణుకుతూ పాటలాగున]

పని యనగా మూలధనము
ఆ టనగా పెద్ద అప్పు
ఏనాటి కే మౌనో ఎరుగము – కాన
ఈనాటికేని మేల్కొ నౌనుగాదె!

యువతీ యువకులు

గానమే ఉన్నంతవరకు
కాలమే ఉన్నంతవరకు
కడపల మా కందుపరకు
తడసిపోము తిరిగిరాము

తాత

ఇ దేమిటి నాచుట్టూ తిరుగుతూ వీళ్ళు! వీళ్ల ఇష్టప్రకారమే జరిగితే లోకం అంతా పనిలేని ఒక పాట అయి ఊరుకుంటుంది. ఇదిగో! మిమ్మల్నే!

వెదు ళ్ళవన్నీ వేణువు లైతే
కుంజా లన్నీ గొంతుక లైతే
పందిళ్ళకు మరి పాకలకు
వాసాలో! రాటాలో!

ఒక యువకుడు

ఏమి కవిత్వం తాతా!

ఒక యువతి

వణుకుతూ ఆ పాటో :

తాత

అమ్మాయీ : ఏమి టా వింతవేషం ? నీ జుట్టులో ఆ పువ్వులు ప్రస్తుతం సరిపోతాయా ? నడిచి వస్తున్న పూలపొద వనుకుని భయ పడ్డాను మొదట :

యువకులు

నన లన్నీ మీ సిగపాయలలో

యువతులు

నగ లైతే వగ లైతే

తాత

కాయలు పళ్లూ కర వైతే - మరి
తీయని తీయని తి క్లేవీ ?

ఒక యువతి

తాతా, మాకు ఒకపాట వచ్చు - నేర్చుకుంటావా ?

వసనా లన్నీ మసనా లైతే
తరుణు లందరూ తాతలె అయితే
ఆటలకూ పాటలకూ
చో టేదీ తో టేదీ ?

[అందరూ గొల్లున నవ్వుతారు]

తాత

అయ్యో నవ్వులా! మిమ్మల్ని చూస్తే జా లేస్తుంది.

మనకు సత్యానికీ మధ్య చిక్కని దొక్క
మంచుతెర పరచి కల దండీ,
మంచుతెర కావలే పొంచియున్నది కోటి
మించులను మించు వెలు గండీ!
మనకు తెరకూ నడుమ కనపడే దంతాను
మాయయే యనుచు నమ్మండీ,
సుకములూ, సొగసులూ, రాగాలు, భోగాలు,
సురిగి చను నమ్మ వ మ్మండీ!

యువతీ యువకులు

ఆగు ఆగు! అయ్యయ్యో!

అయ్యయ్యో ఎవర వయ్యా, జగ త్తి
దంతా మా యని అంటావు?
తియ్య తియ్యనీ రాగము భోగము
తెరలు బుడగ లనుకొంటావు?
ఇది అంధకూప మిది అస్థికార (బతు
కంత పాడు పా డందువు?
పది దిక్కులంటు మధుమల్లి వనము
తుది లేని వల్లకా డందువు?
ఎలమావి కొమ్మశిఖరాల గుండె కో
కొ మ్మటంచు కోయిలలు!

అలసానిలాన తల లూపి పైన, లత
నూగు పూవు టూయెలలు!
ఈ హాయిలోన ఈ తోటలోన
ఎవ్వారి కిట్టి బోధనలు!
ఓహో! విరాగి! ఓహో! విరాగి!
ఉడిగింపు శుష్కసాధనలు
ఏ వారు విందు రోహో!
ఏ వారు విందు రోహో!

ఒక యువకుడు

ఓయీ నిరాశాజీవీ! ఓహో శుష్కవిరాగీ!
నీ అంతర నిశిత నిశితనేత్రము విడిపోనీ!

ఒక యువతి

మననము జగ మని, మనుగడ
శిశిరకాల మని చాల
విసు గేల? విశ్వాసికి వేచియున్న
మధుమాసమె! మధుమాసమె!

యువతీ యువకులు

లే దోయి మాకు విశ్వాస మింక
నీ దైన కుటిలవాక్యాన
ఏ దోయి చోటు హాలాహలమున
కక్షయ్య మమృతభాండాన!

ఒక యువతి

అరుగో అరుగో! యయాతి మహారాజులు వసంతువివేషంలో వస్తున్నారు.

యయాతి

[పాడుకుంటూ దగ్గరగా]

రేగు కోర్కెలగు త్తి నాగుండెవలె
ఎఱ్ఱ నెఱ్ఱ నై నది మావి ఇవురు గుబురు
మ్రోగు పాటలపేటి నాగళమ్మటు
తీయ తీయ నై నది పుల్గు తెరవ గూడు
ననుచనూహల డోల నామన స్సటు
పారు నేరు లై నది గాలియోర యెరక
ననయు తావులకోవ నా మన్కియటు
సితహాసిత మైనది మల్లె యలరుతీవ!

పొడుపు వాకిలి పసిడీ తల్పులు సడల్చి
కనబడని చేయి ఏది విప్పినదో కాని
నాలుగాశలలోపల మూల మూల
లందు చొరబడినా దిదే ఆమనిదొర!

ఒక యువతి

ఓహో ఎదురుగా పోయి మనం స్వాగతం ఇద్దాం.

ఒక గొంతు

ఎవ రావచ్చేరు? పువులతేరుపై

కొన్నిగొంతులు

క్రొత్తకారు క్రొత్తకారు

ఒక గొంతు

చైత్రరథంలోన శ్యామపత్ర పథంపైన
ఆ వచ్చే దెవ రని?

కొన్ని గొంతులు

అది ఆమని! అది ఆమని!

ఒక గొంతు

కుసుమ లతాపతాక!
కోయిల బాకా!
వహావా! ఎన్నాళ్లకు రాక!

కొన్నిగొంతులు

ఎన్నాళ్లకు, ఎన్నాళ్లకు

ఒక గొంతు

కన్నులు కాయలు కాచెను
ఎవరా వచ్చే దని

కొన్ని గొంతులు

ఆమని, ఆమని, ఆమని!

ఒక గొంతు

మరకతముల కుళ్లాయి!
మావి చిగురు తురాయి!
అరదానికి పూన్చిన మల
యానిలం హుమాయి!
ఎన్నాళ్లకు ఎన్నాళ్లకు
కన్నులు కాయలు కాచెను
రమ్మ నండి లోనికి ప్రి-
యమ్మలు పలికి!

తూరుపు దెస బంగరుతలు పోరగ తెరచి
బారులుగా నరనారులు వాకిట నిలిచి
ద్వారముకడ చిరునవ్వుల హారతు లెత్తి
ర మ్మనండి లోనికి; దయచేయమనండి!

కొన్ని గొంతులు

ఎన్నాళ్లకు! ఎన్నాళ్లకు!

ఒక యువతి

ఇలా రావమ్మా శర్మిష్ఠా!

యువతులు

నీ యడుగులు నడిచే చోట
అలరులు పొడిచే తోట!
నవనవజీవన దాతా!
యువమానస నేతా!

ఇంకొక యువతి

శర్మిష్ఠా! నువ్వొక్కరా వేమి? నువ్వు పాడాలి.

శర్మిష్ఠ

ఓ!

యువతీ యువకులు

నీ యడుగులు నడిచే చోట
అలరులు పొడిచే తోట
నవనవజీవన దాతా!
యువమానస నేతా!
నీ చూపులు నిలిచే చోట
తోపులు మొలిచే తోట!
అవిరత రాగవిధాతా!
యౌవత భోగవిజేతా!

ఒక యువతి

వసంతా! విన్నావా? ఎలా ఉంది పాట?

యయాతి

ఒకమాదిరిగా ఉంది.

ఒక యువతి

అలాగా? చూద్దాం నీపని! ఇలా రా అమ్మా శర్మిష్ఠా! నువ్వు వసంతదేవుని పక్కన నిలబడు- పక్కనే. మనం అందరం ఇలాగ చుట్టూ. (అ!

[యువతీ యువకులు యయాతిచుట్టూ నృత్యం చేస్తూ బృందములుగా పాడతారు]

చలిత చలిత మచ్చరణకటక మం
జీర గళస్రుత సింజితమ్ము విను
పిలిచి పిలిచినా, పలుకరించినా
చలియింపదు జడశిలయో? నీ యెద!

తరళతరళ మలయానిల లోల త
రంగచలిత వసనాంచలములు, విను
ఉసురుసు రనినా, గుసగుస మనినా,
ఊగి తూగదే కొరడో? నీయెద!

లులిత లులిత దరహసిత వినిర్గత
లలిత లలిత చంద్రాతపములు, కను
వెలిగి వెలిగినా, తళుక్కు మనినా
పులకరింపదే మొరడో? నీయెద!

ఒక యువతి

శర్మిష్ఠా, అదే మమ్మోయి! అలా ఓరగా ఒరిగావు ఒయ్యారంగా ఆమని దారపై?

యువకుడు

ఆ సెలయేటిపై ఒరిగే కొమ్మ సంపెంగలాగ!

శర్మిష్ఠ

నేను కొమ్మసంపెంగనా?

తెలివి లేదా నీకు, ఉబుసు పోదా నీకు? సెలయేర!
గలగ లనుటే కాని, అలల రొదలే గాని
నిలువవే గడెయేని, నిలిచి యోచింపవే!
సెలయేర, సెలయేర!

తొలిప్రొద్దునుండి ఆ మలుసందెవరకు, నీ
అలల లోలోననే, ఆడు నా నీడ,
ఇన్నాళ్లనుండి ఎరుగవా నీవు?
ఎలుగెత్తి పిలిచినా తల యెత్తబోవ?
సెలయేర, సెలయేర!

యయాతి

అయితే నేను సెలయేటిని! నా పాట వింటారా?

తడసి తడసి పరికింపగ,
తరచి తరచి తెలిసికొనగ

నడక రావి దారినా ?
జడ మగు రహదారినా ?
ఒదిగి ఒదిగి నాలోపల
నిదురించే నీడలను
తుది నంటెడు వరకు నేను
తొంగి జూచికొననె లేను
ఇంత ఇరుకు బొద్దులలో
ఎటులు సాగునో బ్రతుకు
ఈ పాటయె లేకుంటే కడలిచేరు వరకు!

యువతీ యువకులు

బా గుంది, బా గుంది!

ఒక యువతి

ను వ్వేవ రమ్మా ఆలాగున ఒళ్ళు మరచి పరుగెత్తుతున్నావు?

ఆ యువతి

న న్నెరగవూ? కో! కో! కో! చెప్పుకో!

[పాట – అందరూ ఊకొడుతుంటే]

చెప్పుకో చెప్పుకో నే నెవరినో ?
ఓ, ఓ, ఓ!
చెప్పుకో నాపయన మెచటికో ?
కో, కో, కో!

దొాల కనిపించేను నీలాలబయలు
నీలాలబయలులో తేలేటి మొయిలు
ఆ మొయిలు నన్ను ర మ్మంటే
నా మానాన నే పోవుచుంటే
ఒక్కపొదలో రెక్క చిక్కుకుం దమ్మా
అక్క డొక పూతావి అంటుకుం దమ్మా

కొన్ని గొంతులు

కలిగొట్టు పుప్పొళ్ల కాబోలు!

మరికొన్ని గొంతులు

వలిమంచులో తడిసె కాబోలు!

యువతి

దూరాన నొక పచ్చనారామ ముంది
ఆరామమున పచ్చనా(మ తరు వుంది
మావికొమ్మల దాగి కావి వన్నెలది
మాణిక్య మొక టుంది
నన్ను ర మ్మంది
అటకు పోతుంటే
ఒక్కపొదలో రెక్క చిక్కుకుం దమ్మా!
అక్క డేదో తావి అంటుకుం దమ్మా!

కొన్నిగొంతులు

కలిగొట్టు పుప్పొళ్ల కాబోలు!

మరికొన్ని గొంతులు

వలిమంచులో తడిసె కాబోలు!

ఒక యువకుడు

అవును గావీ. నీ కెలా తెలిసిపోయింది చైత్రం వచ్చిం దనీ!

యువకులు అందరూ

కొండ కొండల నడుమ కోనలో
కోనలోపల కునుకు పల్లెలో
కెరడు కెరడుల మంచు కరగి విడిపోదే
మొరడు మొరడుల తొగరు పొడయె కనరాదే
చివురు మొలనూ లాడ
చైత్ర మొచ్చిన జాడ
ఎవరు చెప్పిరి నీకు
ఎరుగ జెప్పవె నాకు.

యువతి

నే నెలా చెప్పగలను!

గుండె ఎగిరినంత మేర గొంతు పరవదు
గొంతు వెడలి పారు దవుల కెరక జరగదు
గండురాయి రెక్క విడక గుండెగొంతు మీటి
తోపు దాటి, తోట దాటి ఏ పులుంగు పాడునోయి!

యువతులు అందరూ

కెలను కెలనుల నడుమ కొలనులో
కొలను లోపల కునుకు కలువలో
నిదుర నొదిగిన తేటికొదమ కను వీడదే!
కదలి మెదలని తావి యెఱక విడిపోదే!
మరుగు పాత్రిక గొనుచు మధువు వచ్చే ననుచు
ఎవరు చెప్పిరి నీకు, ఎరుగ జెప్పవె నాకు.

ఒక యువకుడు

నేను తుమ్మెద ననా అడుగుతున్నారు? నేను మాత్రం ఎలా చెప్పగలను?

చిమ్మనాడు చిరుపుప్పొడిదుమ్ము కనుల గాలి
ఎవరు చూచినారో, ఎపుడు వచ్చెనో ఆమని?
నిండి నిండి పువు పువు పువు
గుండెనుండి పడదు మధువు!
మును మున్నె గళ మెమ్మెయి
అనును జుమ్ము జుం జు మ్మని

యువతీ యువకులు

మాట్లాడకండి! ష్! పాడకండి! అ దేమిటి?

ఒక యువతి

ఏమి టా చాటింపు?

[దూరాన్నుంచి కవి చాటింపు చేస్తూ పాడుతూ వస్తాడు]

కవి

జాగ్రతండి! జాగ్రతండి! జంట విడిచి తిరగకండి!

ఏ గ్రహచారమో మన్మథు డాగ్రహించి పడెనండి!

యయాతి

ఏమిటి మహాకవీ! నీవే చాటింపు చేస్తున్నా వేమిటి?

[యువతుల నవ్వులు]

కవి

ఈ చాటింపు నే నొక్కడనే చేయగలను. ఈ విషయం నాకు తెలిసినంత బాగా ఎవరికీ తెలియదు.

ముసరు మంచుతెరల మీటి
ముసలి ఆకుతెరువు దాటి
విస విస మని రేగి పడే
వెడ విలుకా డెంత మేటి?

ఒక యువతి

ఏ మయ్యా కవీ! మన్మథుడికి శరీరం లేదు కదా నీ కెలా కనపడ్డాడు?

కవి

స్పష్టంగా కనపడుతున్నాడు నా కడుగో! మదనదేవుడు. అడుగో! అబ్బా!

చెరకువింటి కెంత జోరు!
చెవుల తేటినారి హోరు!
పరచు గాలి బయలు వింద
చివురు జెండా ఎగిరి పారు!

అమ్మయ్యో!

ఒక యువకుడు

ఆ బాధ మీ కెలా తెలిసింది?

కవి

పాపం మీకు తెలియదులే! మీ వైఖరి చూస్తే మీ కెవరికీ తెలియన ట్టుంది. పాపం!

మొరగి కన్ను నిలిచె మరుడు
పొంచి పొంచి పుంత పుంత!
నరనారీ కోటి కెంత పెనునలంత వలవంత!
విరియు మల్లెకొసల కెంత మరిగిపోవు విసపువేడి
మరచి నిదుర మరగినప్పు డెంత దాడి ఎంత దాడి!

యువతీ యువకులు

అమ్మో! అమ్మో! అబ్బా అబ్బా!

కవి

"కాయజనాయకుం డలరుగద్దియ నెక్కె వసంతవేళ సుం
డో, యిల నెల్లవారలు తదుత్సవసంపదసొంపు చూడ రం

డో, యెలనాగల న్విడిచి యొంటి చరింపకుడో"—

[భోజరాజీయము]

ఆహాహా! ఎంత త్వరగా జంటలు జంటలుగా అలుమగలు కలిసిపోతున్నారు!

[నవ్వుతూ] చివరికి నేనే ఒంటరిగా మిగిలిపోయిన ట్టున్నానే!

తాత

నేనూ మిగిలాను!

కవి

ఏం తాతా! ఇక్కడే ఒదిగి ఉన్నావా? నువ్వు కూడా వాటికి పోతున్నా వేం? పెద్దవాడవూ! జ్ఞానివీ! విరాగివీ! మరచిపోయావా?

"మనకు సత్యానికీ మధ్య చిక్కని దొక్క
మంచుతెర పరచి కల దండీ!"

[నవ్వుతాడు. పాడుతూ దూరంగా పోతాడు]

జంట విడిచి తిరగకండి ఒంటరిగా మీరు మీరు
తుంటవిల్తు వింటిహోరు వింటేనే సరి చెడేరు!
జాగ్రత్త తండి! జాగ్రత్త తండి!

[దూరంగా పోతాడు]

ఒక యువకుడు

ఈ కాలువ దాటలేవా?

ఒక యువతి

ఇది కొత్త తేనె కాటోలు, కాలు జారుతుంది.

మరో యువకుడు

ఈ పొదరింటి కింద దూరి :-

ఇంకొక యువతి

అమ్మయ్యో : దూరలేను. కళ్లనిండా మల్లెపుప్పొడి పడింది.

మరొక యువకుడు

అదిగో మన వీడు. ఆ గోరింటలు పరిచిన దారినే వెడితే :

మరొక యువతి

అటు వెడితే మాలతీలత కాలికి చుట్టుకుంటుంది.

[ఇటు ఇటు అన్నట్లూ, పరుగెత్తుతున్న అడుగుల చప్పుడైనట్లూ, 'జాగ్రత తండీ' అన్నపాట దూరాన చాటిస్తున్నట్లూ వినపడాలి]

## అయిదవ రంగము

యయాతి

శర్మిష్ఠా :

శర్మిష్ఠ

మహారాజా :

యయాతి

ఇది స్వప్నమేమో :

శర్మిష్ఠ

సత్యంగా మారిన స్వప్నం మహారాజా!

యయాతి

ఎ వ్వెవరవు? వసంత వనలక్ష్మివా? చైత్రాగమనానికి పుల కించి పోయి, నారీరూపంలో సాక్షాత్కరించిన ప్రకృతి దేవతవా?

శర్మిష్ఠ

మీ చరణదాసిని మహారాజా!

యయాతి

ఇన్నాళ్లనుంచీ నీ వెక్క డున్నావు?

శర్మిష్ఠ

ఈ తోటలోనే, మీ సన్నిధినే!

యయాతి

అప్పుడు ని న్నెందుకు చూడలేదు నేను?

శర్మిష్ఠ

ఎప్పుడూ మీ అంతికాన్నే ఉన్నాను. కాని అప్పుడు అడ్డుగా మంచుతెరలూ, శిశిరపత్రాలూ ఉన్నాయి.

యయాతి

నా డెన్నడో నూతిలోనుండి వచ్చిన దేవయాని ఇప్పటి నీలాగే ఉంది సుమా అప్పుడు!

శర్మిష్ఠ

మహారాజా! మీరు వసంతులు! అప్పుడు వనలక్ష్మి దేవయాని. ఇప్పుడు——

యయాతి

శర్మిష్ఠా! ఎంత గొప్పసమయం! ఇప్పుడు ఈ లోకంలో ఏ వస్తువునూ ప్రేమించకుండా ఉండలేము. ఇంత అనురాగమూ ఆనందమూ ఎక్కడ దాగి ఉన్నాయో ఇన్నాళ్ళూ!

ఏచోట దాచితివో, ఈ చైత్రజీవమ్ము,
ఇన్నాళ్లు మాకనుచు దేవా!

ఈ చీకు హృదయాలు, వేచి కననేలేవు
నీ చిత్రములు దేవదేవా!

ఏ నీలిపందిళ్ళ, ఏ నిదుర పొదిగిళ్ల
ఈ తార లలసెనో దేవా?

నీ నందనమ్ములో, నేటి అర్చనములో
పూవులై విరిసెనో దేవా!

ఏ సీతుకాలాన ఏమంచు నునుసోన
గళములో కునికెనో దేవా?

నీ వసంతమ్ములో నేటి కీర్తనములో
పికములై పలికెనో దేవా!

ఇక హిమర్తువు వలదు, ఇక నిశీథము వలదు,
నీ సన్నిధియె దేవదేవా!
ఒక వసంతము పైన, ఒక ప్రభాతము లోన
వికసింప జేయవా దేవా!

[పక్షుల కూతలూ, సెలయేళ్ల గలగలలూ, చిరుగాలి ఈలలూ, ఆకుల కదలికలూ, ఇలాంటి చప్పుళ్లన్నీ వినబడి; తరువాత రకరకాల వాద్యాల ధ్వనులు ఒకటి తరవాత ఒకటి వస్తాయి]

# కృష్ణాష్టమి

[చైట వహోరు గాలి వీచివీచి ఆగుతుంది. జానజల్లు పడిపడి ఊరుకుంటుంది. తర్వాత ఉంటుందే నిశ్శబ్దం - అది ఉంటుంది. నందుని యింట్లో - గదిలో - యశోద, రోహిణి, రాధ]

యశోద

[మూలుగుతూ] ఏమమ్మా రాధా! అబ్బా! ఊఁ! ఎందుకమ్మా ఇలాగా! ఊఁ! [మూలుగు]

రోహిణి

సరిసరి! రాధా! అలా పెడుతున్నా వేమిటి మొహం? ఇప్పుడు పాట మొదలెడుతున్నా వేమిటి? ఈ పిచ్చి నిన్ను వదలదు.

రాధ

ఊరుకో! ఈవేళ పాడకపోతే ఎలాగ?

[ఆనందభైరవి రాగము - జంపెతాళము]

ఈ వింత లీలాటి వే రేయి చూచేనె!
ఏ పీటి యతిథి ఇపు దేగుదెంచేనె!
వేగు కన్నులు విచ్చి వేచియుండుటె కాని
తూగదే, నిదురలో తోగదే మా యిల్లు!
వ్రేపల్లె వాడలో ఏ పున్నెమో గాని
విశ్వవిశ్వమ్ములే విచ్చేసి విడియునే!

పెరటిలో కడిమిశాఖ రవంత యోరగా
తిరిగి, కనువిరిసి, మందిరములోనికి చూచు !

రోహిణి

హాయ్యో హాయ్యో ! నిజంగా ! ఇందాకా నేనూ ఇలాగే అను కున్నాను సుమా ! మా యింట్లో దొడ్డివైపు గవాక్షంలోనుంచి కడిమి పూలు అలా కళ్ళు విప్పి లోపలికి చూస్తున్నట్లు - సరిగ్గా ! సరిగ్గా !

యశోద

ఊఁ ! ఊఁ ! ఊఁ ! [మూలుగు]

రాధ

విను మరీ ! వదినా !

మోసాల వకుళమ్మ మైసోల, పూల, కు
ప్పలుగ తిప్పలుగ కొండలుగ రాలుచు నేల !
ఈ వింత లీలాటి వేరేయి చూచేనె !
ఏ పీటి యతిథి ఇపు దేగుదెంచేనే !

యశోద

[మెల్లగా నవ్వుతూ] మా రాధమ్మ ఏమి చెప్పినా పాటలోనే చెప్పాలి - రోహిణీదేవీ !

రోహిణి

దాని కేమిగాని, ఇందాకా శశిరేఖా నేనూ వస్తూంటే, అను కున్నాం గూడా నమ్మోయ్ ! మా పొగడా మీ పొగడే కాదు - తోవ

పొదుగునా పొగడలన్నీ గుట్టలు గుట్టలుగా కురిపించేశాయమ్మోయ్. పువ్వుల్ని - ఈ రాత్రి - చిత్రం!

యశోద

రాధా! [మూలుగు]

రాధ

ఇదిగో నమ్మా! విను మరి!

పొదువెల్ల కరగగా, మొదవు వెన్నెలపాలు -
కొలువట్టి బాలలో కసవు వామిని చుట్టి!
ఈ వింత లీలాటి వేరేయి చూచేనె!
ఏ వీటి యతిథి ఇప్డు దేగుదెంచేనె!

రోహిణి

ఒకు! నిజంగానే ఒకు! మా యింట్లో పాకలోనుంచి పెరటి లోకి కారాయి తెలుసునా మా కర్రావు పాలు - ఇప్పుడే - ఊరికే!

యశోద

ఏమమ్మా రాధా! [మూలుగు]

రాధ

[నవ్వుతూ] వదినమ్మా! వినవమ్మా!

ఏ పాల కడలి నీలో పొంగునో కాని
తడియు నీ తెలిరైక - తడియు నీ వెలిపైట!
ఈ వింత లీలాటి వేరేయి చూచేనె!
ఏ వీటి యతిథి ఇపు దేగు దెంచేనె!

[రోహిణి కిలకిల నవ్వుతుంది. గది అవతల నందుడూ - ఉద్ధవుడూ - రాయణుడూ]

నందుడు

ఏమయ్యా ఉద్ధవా! దూరాన ఏ సవ్వడి వినబడ్డా వసుదేవుడు వస్తున్నట్లే అనిపిస్తూంది. దైవజ్ఞులు చెప్పిందే నిజమైతే, ఇక్కడ - మన యింట్లోనూ - అక్కడ దేవకమ్మకూ ఒక్కసారే పురుడు రావాలి.

ఉద్ధవుడు

అంతే కాదు నందా! పురుడు రాగానే యశోదమ్మకు నిద్ర లాంటి దేదో మగత క్రమ్ముతుందట! ఆ సమయంలో దేవకీదేవి బిడ్డ ఇక్కడ యశోదమ్మ పొత్తిళ్ళలో ఉంటాడట!

నందుడు

నా కీ మార్పు బాధగా తోచడం లేదయ్యా! ఏదో అంతా త్వరగా జరిగిపోవాలనీ, ఎందుచేతనో మహానందంగానూ ఉంది. ఏమిటో చెప్పలేను తెలుసా?

ఉద్ధవుడు

ఇది గొప్పసమయం నందా! అహోహో!

[వెదుళ్ల పాట వినపడుతుంది]

అదిగో! అలా! వింటున్నావా?

కొసరు పీవలి వల్రివేలి కొసలు కూడ
వేగిరింపవు, వేధింప; వేలా కాని

ఊరి పొలిమేర పుంతల మోర లెత్తి
నిదుర విడి పాడు నీ రేయి వెదురుపొదలు!

రాయణుడు

అవునయ్యా! ఆ వెదురు పొదలుమాత్రం ఎందుకు మేలుకువి పాడుతున్నాయో!

నందుడు

ఆహా! ఏమి రాత్రయ్యా ఇది ఉద్ధవా!

ఉద్ధవుడు

అయ్యా! నాకేనా, మీకూ ఇలాగ తోస్తోందా?

ఒక తలిరుటాకు తుదయేని, ఒక లతాగ్ర
మేని, తలయూప; దొక సూనమేని వలచి
ఉస్సురన, దే నిరీక్షణ నున్నయదియొ -
ఈ విభావరి వేళ బృందావనమ్ము!

రాయణుడు

అటు యమునదాకా ఆ తోపులన్నీ జపం చేస్తున్న ట్లున్నవి.

నందుడు

యమున అంటే తోచింది - యమునానది కెరటాల చప్పుడు ఏమీ వినబడదేం ఈ రాత్రి?

ఉద్ధవుడు

ఇందాకా నేను వస్తూన్నప్పుడే అలా ఉంది. పక్కనున్న సైకత పీఠికంటే మూగగా ఉంది యమున.

కదల, కూపిరి వదలక, యెదురు తెరువు
అరసినట్లు, ఎవ్వరొకాని దరిసినట్లు
తరగ యెగయక, పొగయక నురుగు, యమున
నిదురగాని నిదుర మున్గి కదలలేదు.

రాయణుడు

(ఆశ్చర్యంతో) ఆఁ ! ఆఁ ! ఆఁ ! అదేమిటి ?

ఉద్ధవుడు

ఆహా ! ఆహా ! నందా ! మహాముహూర్తం వచ్చిం దయ్యా !!

నీలగగనాంచలమునుండి, నేలపైకి
శ్రావణవలాహక స్నిగ్ధశకల మొండు
జారగా —

రాధ

(లోపలనుండి) శీర్షోదయ మయింది.

రాయణుడు

ఓహో ! ఆహా ! అదేమిటి ?

ఉద్ధవుడు

— తోడ నోరగా జాలువారె
చంచలా కాంచనాంచిత కాంచి యొకటి !

అబ్బా ! నాలుగు గడియలు ఓపిక పట్టాలి.

రాధ

[ఇవతలకి వచ్చి] నాలుగు గడియలు ఎలాగ ఓపిక పట్టడమూ? అన్నయ్యా! ఆడపిల్ల. వదిన మగతగా పడుకుంది. ఇంకా రాదేం వసుదేవుడు? అబ్బా! లోపల ఈ హృదయం ఇమిడి ఉండడం లేదు.

[లోపలినుంచి చంటిబిడ్డ యేడుపు వినబడుతూంటుంది; దూరాన్నుంచి, మధ్య మధ్య, చంటిబిడ్డ యేడుపు వినబడుతూన్నట్టుంటుంది...వసుదేవుడూ అక్రూరుడూ మాట్లాడుతూ, అంత కంతకు దగ్గరకు వస్తారు.]

వసుదేవుడు

పాపం. అక్రూరా! బిడ్డను వదలలేక ఎంత యేడ్చింది దేవకి!

అక్రూరుడు

కాని, ఎటువంటి గొప్ప హృదయం ఆమెది! పిల్లవాణ్ణి మీ కిచ్చేటప్పుడు మీ రామె వైపు చూడలేక పోయారు గాని. నేను చూశాను.

వసుదేవుడు

అలాగా?

అక్రూరుడు

ఆమె కళ్ళు రెండూ, రెండు సూర్య మండలాలలాగ, ఒక్క చిటిక ధగధగా మెరిసేయి - దూరమూరాలను స్పష్టంగా చూస్తూన్నట్లు! వాటిలో తన భావ్యానందమే కాదు - కంసమర్దనమే కాదు - అఖిల లోక కల్యాణమూ - ఏవో, ఎన్నో....ఆ! ఆ! జాగ్రత్త! యమున ఒడ్డుకు వచ్చాము, వసుదేవా!

వసుదేవుడు

ఇదేమి చిత్రం! భగవతి యమున కెంతదయ మనమీద! కత్తితో కోసినట్లు, సరిగ్గా రెండుపాయలై. ఎలాగ దారిచ్చిందో!

అక్రూరుడు

ఈ యిసుక తిన్నెలు కాస్త శ్రమపడి దాటాలి.

వసుదేవుడు

అక్రూరా! ఇది బృందావనమా?

అక్రూరుడు

అవును. అదుగో, దూరాన ఆ తోపులలో అది వ్రేపల్లె. ఇటు ఇటూ! ఈ వైపు వెళ్ళాలి. అదుగో అది - తూర్పువైపు పెద్ద యిల్లు- నందునిది. అదుగో - గుమ్మం దగ్గర నందుడూ ఉద్ధవుడూ! అదుగో, చంటిబిడ్డ నెత్తుకొని రాధ! ఎదురుగా పరుగెత్తి వస్తున్నారు.

[అడుగుల చప్పుడు]

నందుడు

అయ్యా! వసుదేవా?

వసుదేవుడు

నందా!

రాధ

అబ్బ!

[ఇద్దరు పిల్లల ఏడుపు- తరవాత వేణు గానమూ, అంభా రవమూ, చాలా దూరాన యమున గలగలా వినబడతాయి. తర

వాత. ఒక్క నిముషం నిశ్శబ్దం...కొక్కొరోకో అని కోడికూత. చల్ల తరిచినట్లు చప్పుళ్లు. ఇంట్లో చంటిపిల్ల ఏడుపు.]

రాధ

ఊరుకో! ఊరుకోవయ్యా మరి! ఎంత దొంగవు! అప్పుడే ఎన్ని నేర్చావు! ఇప్పుడు విప్పావా నీ కళ్ళు. రాధ ఒళ్ళో పడుకున్నాక!....అదిగో! మళ్లీ కళ్ళు మూసుకున్నావా నిద్రపోతున్నట్లు! అబ్బో! నీ సంగతి నాకు తెలుసులే!

[ఆఠాణా రాగము-త్రిశ్రగతి త్రిపుట తాళము]

అదిరా! అది మాయ నిదర గదరా!
కదిలే రెప్పల వెనక మెదిలే తుమ్మెద లవిగో!
నా చక్కిలి గిలి సైచి నంగనాచి ఏమౌదువు?
పూచే నవ్వుల, మంకెన పూపెదవుల దాచలేవు!
మేలు కొన్నవాని లేప బేల యశోదమ్మ గాను!
ఏలా నీ లీలలు నా మ్రోల నీలమోహనా!

[జో కొడుతున్నట్టు కూనరాగం తీస్తూంటే, దూరాన్నుంచి పరుగెత్తుకుని వస్తున్నట్టు అడుగుల సడులు. తలుపు తలుపు తలుపు అని ఆడ గొంతుకల కేకలు]

గోపిక ౧

తలుపమ్మోయ్!

గోపిక ౨

పురు డొచ్చిం దమ్మా!

గోపిక ః

అదిగో - రాధమ్మ కూనిరాగం తీస్తోంది !

అందరూ

తలుపు తలుపు తలుపూ ! తలుపు తీయ వమ్మా !

[తలుపు తీసిన చప్పుడు]

రాధ

ఇంకా తలు పేమిటర్రా వెర్రివాళ్ళల్లారా !

[భీమ్‌పలాస్ రాగం - జంపె తాళం]

వేయ బోవని తలుపు తీయమంటూ పిలుపు !
రాధ కెందుకో నవ్వ గొలుపు !
నీలోన నాలోన నిదురపోయే వలపు
మేలుకుంటే లేదు తలుపు !
విశ్వమంతా ప్రాణవిభుని మందిరమైన
వీథివాకిలి యేది చెల్లెలా !
విశ్వవిభుడే రాధ వెంటనంటీ రాగ
పిలుపేది తలుపేది చెల్లెలా !

[అందరూ గొల్లున నవ్వుతారు]

రాధ

నవ్వండి ! నా కేం సిగ్గులేదు. నేనూ నవ్వుతాను. (నవ్వుతుంది). రండి - లోపలికి, మాధవీ ! రా శశిరేఖా, మంజుఘోషా,

అందరూ రండమ్మా! ఈ ఉయ్యాల దగ్గిరికి. లాలిపాట నేర్పనా? ఇ దొక్కటే అందరూ అనండి!

యశోద

(మెల్లగా) నేనో!

రాధ

నువ్వు కదలకు వదినా!

[శహాన రాగము _ జంపె తాళము]

జో జో చిన్నికృష్ణ! జో ముద్దుకృష్ణా!
జో కృష్ణ జో కృష్ణ! జో బాలకృష్ణా!

ఆగండి! వినండి! ముందు నేర్చుకోవాలి?

రోహిణి

ఏం నేర్పుతావు? అలా ఒళ్లు మరిచిపోయి! ఆ నవ్వేమిటి? ఆ కళ్ళంట నీ శ్కేమిటి?

రాధ

"జో జో చిన్నికృష్ణా" అన్నది ఒక్కటే అందరూ పాడండి! తెలిసిందా?

అందరూ

జో జో చిన్నికృష్ణ! జో ముద్దుకృష్ణా!
జో కృష్ణ జో కృష్ణ! జో బాలకృష్ణా!

రాధ

వెన్నెల్లు పరచిన విన్నుపానుపు మీద
కన్ను విప్పక తాను పన్నుండె కరిమబ్బు!
చల్లగాలులు తెచ్చి చామరమ్ములు తెచ్చి
ఊయాల నచ్చరల్ ఊపేరె వావి!

అందరూ

జో జో చిన్నికృష్ణ! జో ముద్దుకృష్ణా!
జో కృష్ణ జో కృష్ణ! జో బాలకృష్ణా!

రాధ

నురుగుల్లు పరచిన తరగపై కలువపై
ఒరిగి గాటపునిదుర మరగెనే చిరుతేటి!
విసరు ఊర్పులు తెచ్చి వింజామరలు తెచ్చి
ఊగించిరే వావి నాగకన్యలు వచ్చి!

అందరూ

జో జో చిన్నికృష్ణ! జో ముద్దుకృష్ణా!
జో కృష్ణ జో కృష్ణ! జో బాలకృష్ణా!

[అవతలనుంచి, వస్తున్న మగవాళ్ళ నవ్వు వినబడుతుంది]

రాధ

అదుగో - అన్నయ్యా ఉద్ధవుడూ వాళ్లూ వచ్చేరు....ఏది ‒ అన్నయ్యా! మీరుకూడా నేర్చుకుంటారా పాట?

నందుడు

[నవ్వుతూ] వేర్పమ్మా అమ్మాయీ! రండయ్యా అందరూ!

రాధ

మీరు అటు! మేము ఇటు! తమరు పడుకోండి యశోదమ్మ గారూ!

[తిలక్ కామోద్ రాగము - ఆదితాళము]

జయ జయ కృష్ణా! జయ జయ కృష్ణా!
జయజయ జయజయ జయ గోవిందా!

జయజయ గోపకిశోర! యశోదా
నందా నందకుమార! మనోహర!

జయజయ శ్రావణ జలదేందీవర
తరుణ తమాల కిసాల సమాన
శ్యామల కోమల చారు శరీరా!
మామక హృదయాంతర సంచారా!
జయజయ కృష్ణా!

జయజయ నవనవ సుందర సుమధుర
దరహాసి తోన్మిషి తానన మోహన
రజనీకర! మధుకరమృదుచికురా!
రాధా మానసధన పాటచ్చర!
జయజయ కృష్ణా!

జయజయ కదంబ కకుభప్రసూన
కేసర కేసర నవకువలయదళ
సురభిళ మృదుశయ్యాప్త విహారా!
గోపీ జనతా ఘనతాప హారా!
జయ జయ కృష్ణా!

[వేణుగానము. పక్షుల కూతలు. యమున గలగల. చిరుగాలి సవ్వడి]

గోపకుమారులు

లే లే లే లే!
తెల్లారక మునుపే మా పల్లియ లేస్తుంది!
పల్లెలోన ప్రతియిల్లూ కళ్లు తెరచి చూస్తుంది!
చల్ల తరిచి తరిపివెన్న గొల్లపడుచు తీస్తుంది!
ఘల్లు ఘల్లుమని అందెల సందడి వినిపిస్తుంది!
కర్రిఆవు పొదుగు కరిగి కడివెడు పాలిస్తుంది!
జుర్రుమంట త్రాగమంటు తల్లి పిల్ల కిస్తుంది!
తుర్రుమంటు వాడ లేగదూడ ఉరక లేస్తుంది!
మర్రిచెట్టు నీడ ఆలమంద ఆగి చూస్తుంది!

గోపికలు

ఏ దమ్మా మీ వాడు?
వాడల తిరిగే కోడెకాడె, వా–డేదమ్మా?

పడిచేయక చొరబడి మాలోగిట
కడివెడు వెన్నల మెసవేనే।
ఒడిసి పట్టి మా బుడుగావు పొదువు
దుడుకు లేగవలె కుడిచేనే—ఏడమ్మా?

మడుగున జలకము లాడునపుడు మా
మడుగుల నెల్లను దోచేనే।
బుడుతడని చంక నిడుకొన్న, నన్ను
పడుచు పోకడల రేపేనే। —ఏడమ్మా?

[పద్యం]
వెదు రిదిగో పాటలకై,
ఇదిగో పింఛమ్ము, చిక్క మిదిగో కృష్ణా।
చదువా సంధ్యా? పెయ్యల
కదుపుల గాయంగ నింక కదలగదయ్యా!

తానే నాకయి స్వామి వచ్చెనట బృందన్‌వీడి, గోగోప బృందానన్ విందులకూడ వీడి, ప్రియరాధాసుందరీ రాగ గాథానవ్యోత్సవమైన వీడి; అటుకాదా, యేల నాలోన నిల్లౌనా, నాహృదయాన శారదశశాంకాంశుప్రభల్ పర్వునో!

ఏ నెరుంగుదునే సఖీ తప్పదే విను
అవి దేవదేవుని అడుగుసడులె।

★★★★★★★★★★★★★★★★★★★★★★★★★★★★★★★★★★★★★★★★★★★★

ఊరకే ఈలాగు కోరగించునె చూడు
మేను మేను కడిమిబ్రమాను వోలె!
ఇటు నటు తూగాడు నేయెద శ్యామసుం
దరుమెడ పొగడ పూసరము కరణి!
ఏలాగు రాగమ్ము లెగయునో యమున హృ
దయమున తరగదొంతరల పగిది!

అఖిల హరిదంతరాళమ్ము నందు నిండి
స్వాంతమందు శరద్విభావరియె పండె!
అదె అదే స్వామి వేంచేసె, నదె, అతండె
అస్మదానంద జలధి నీహారరోచి!

అయ్యయో నీలమోహనమూర్తి కాదది
సాంద్ర కదంబక చ్ఛాయగాని -
అదిగొ చలచ్చంద్ర కావతంసము కాదు,
చపల కిసాల మంజరియె సుమ్మ -
వినరాదొ మరల పిల్లనగ్రోవి కాదె, వె
దుళ్ల పయ్యెర పరవళ్ల రవళి -
అది చిరునవ్వు కాదమ్మ, కొమ్మలసందు
లందలి వెన్నెల యలరు కనుము -

ఏటి బృందావనీ వాటి, ఏటి తరణి
నంద నానందరాగ నిష్యంద గీతి,

ఏటి వ్రజపల్లి, అవ్వి ఏనాటి కథలు,
ఏల రాధా వృథావ్యథలు, ఏల తల్లి!

[పాట]

ఈ దారి నా స్వామి నడచేనా?
పాదాల జాడ లివి విడిచేనా? -

ఎవరైన నా విభుని చూచేరా? - స్వామి -
ఏమైన నామాట అన్నారా?

ఎన్నాళ్ల కెన్నాళ్ల కన్నారా? - మీరు -
కన్నార నా స్వామి కన్నారా?

కరిమేను చిన్నెల్లు విరిసేనా? స్వామి
చిరునవ్వు వెన్నెల్లు కురిసేనా?

శిఖపైని శిఖిపింఛ మూగేనా? స్వామి
ఒకసారి నవవేణు వూదేనా?

మనసంత కోరికలు మూగేనా? మీ
మనికంత ఊయాల లూగేనా?

బృందావనీ సీమ ఇదియేనా? కా
ళిందీ నదీతీర మిదియేనా?

రాధా మనోవీథి విడిచేనా? స్వామి
ఈదారి నాకొరకు నడిచేనా?
ఏమైన నామాట లడిగేనా?

[పద్యం]

నిద్రమానె వెన్నెలలు, నిర్నిద్రరాగ
రేయి నిట్టూరుచు, తమాల వృక్షమూల
సైకత వితర్దికోపరి శ్యామపర్ణ
పాళి పానుపుగాగ నేర్పడె తనంత।

దరియుకొలది చాల దవ్వౌను; దవ్వైన
కొలది దరిసి దరిసి పలుకరించు;
నిలువనీదు కదలనీదు వేణువు కృష్ణ।
పిలుపొ, వలపొ, మేలుకొలుపొ గాని।

తనది కరిమబ్బుమేని సౌందర్యమంట।
నిండుపున్నమి నెటుల పండించు కడల?
అంత శిశిరమ్మొ తన సుషిరామృతమ్మొ।
ఎటుల రగిలించునో కదే ఈ దవాగ్ని?

అలరు పన్నీరొ నా చలువ కన్నీరు నీ
తలిరు పాదములకై కృష్ణా।
అలసి వచ్చెద వేని నలగి నొచ్చెద వని
కలగిపోదా మనసు కృష్ణా।

# యమునా విహారి

[కార్తీక పూర్ణిమ. కొంత రాత్రి కడచింది. దూరాన్నుంచి యమునా నది రొదతో కలిసి వేణుగానం. ఇంతలో వేణుగానంతో కలిసి అడుగుల చప్పుళ్ళు]

మగగొంతు

ఓ హో హో! [పిలుస్తున్నట్లు]

ఆడగొంతు

ఓ హో హో! [మారు పలికినట్లు]....ఓ హో హో!

[ఆడగొంతులు నాలుగు వైపులనుంచీ, ఇక్కడనుంచి పిలిస్తే పలికినట్లూ, నాలుగు మూలలనుంచీ వచ్చినట్లూ, గొంతులు వినబడాలి]

మగగొంతు

[పాట]

ఓ హో హో!

ఆడగొంతు

ఓ హో హో!

అందరు

ఓహో! ఓహో! ఓహో!

ఆడగొంతు ౧

ఎవరయ్యా పిలిచేరు?

ఆడగొంతు ౨

ఇటు గుండెలు కలచేరు ?

అందరు

బృందలోన మంద లోల మారుతములు తరలు !

మందానిలములను యమున అందెరవళి పొరలు !

మగగొంతులు

ఓహో ! ఓహో ! ఓహో !

ఆడగొంతులు

ఓహో ! ఓహో ! ఓహో !

ఆడగొంతు ౧

ఎవరయ్యా పిలిచేరు ?

ఆడగొంతు ౨

ఇటు గుండెలు కలచేరు ?

అందరు

సాలతరువు తలపై నెల పైన మాపి వినును !

మాలతి శేఫాలి కొమ్మపైకి ప్రాకి కనును !

మగగొంతులు

ఓహోహో ! ఓహోహో !

ఆడగొంతులు

ఓహో! ఓహో! ఓహో!

ఆడగొంతు ౧

ఎవరయ్యా పిలిచేరు?

ఆడగొంతు ౨

ఇటు గుండెలు కలచేరు?

అందరు

పల్లెలో పెరళ్ళలోని ఆలు చిందులాడు!

గొల్లల లోగిళ్ళ లోగి గుండె లుండ నోడు!

మగగొంతు

ఓహోహో! ఓహోహో!

ఆడగొంతులు

ఓహో! ఓహో! ఓహో!

ఎవరయ్యా పిలిచేరు?

మగగొంతులు

ఓ హో హో! [దీర్ఘంగా పిలుస్తూన్నట్లు]

ఒక ఆడగొంతు

ఎక్కడే?

మరొక ఆడగొంతు

ఎప్పుడూ ఇంతేనే! యమున ఒడ్డునుంచి పిలిచినట్లూ -

వేరొక ఆడగొంతు

కదిమి తోపులో నుంచి పిలిచినట్లూ -

మరొక ఆడగొంతు

ఆలమందల నడుమ నుంచి పిలిచినట్లూ -

ఒక ఆడగొంతు

[కిలకిల నవ్వుతూ] ఉద్ధవుడు ఎలాగ పరుగెత్తుకుని వస్తున్నాడో! మనకన్నా కూడా మతిపోయి....[అందరూ నవ్వుతారు]

వేరొక ఆడగొంతు

మురళి మ్రోగినప్పుడు మాత్రమే మనకు మతిపోతుంది అంతే! ఉద్ధవుడు అస్తమానమూ ఉలికిపడుతూ ఉంటాడు.

ఒక ఆడగొంతు

మొన్నరాత్రి ఓ చిత్రం జరిగిందర్రా! హఠాత్తుగా తలుపు తీసుకొని అర్ధరాత్రి ఉద్ధవుడు యమునవైపు పరుగెత్తుతున్నాట్ట! "ఏమిటిది నువ్వు కూడానా?" అని నందుడు ఆపి పలకరిస్తే, "అందరమూ ఒక్కటే - ఆడవాళ్ళమే! అతనొక్కడే మగవాడు" అని చెప్పి తొందరగా వెళ్ళిపోయాట్ట! [అందరూ గొల్లుమని నవ్వుతారు]

మరొక ఆడగొంతు

అదుగో! అటు - వినండర్రా!....[వేణువు మ్రోగుతుంది]

వేరొక ఆడగొంతు

కాదే! ఇటు - మొగలి పొదల వైపు!

ఒక ఆడగొంతు

అయ్యో! కాదర్రా! ఆ కడిమిచెట్టు వైపే! ఆయనకి ఆ చోటిష్టం.

మరొక ఆడగొంతు

ఓ పని చేద్దాం. కొందరం అటు వెడదాం; కొందరం ఇటు వెడదాం. దొరక్కపోడు దొంగ!

కొందరు

అటు మీరు! ఇటు మేము!

అందరు

అలా అలా అలా! ఇలా ఇలా ఇలా!

ఆడగొంతు ౧

మొగలి దారు లంట -

ఆడగొంతు ౨

పొగడ దారు లంట -

అందరు

అటు మీరు! ఇటు మేము!

కొందరు

అలా అలా అలా! ఇలా ఇలా ఇలా!

ఆడగొంతు ౧

కసవుబీడు దాటి -

ఆడగొంతు ౨

ఇసుకబయలు దాటి -

అందరు

అటు మీరు - ఇటు మేము!

కొందరు

అలా అలా అలా! ఇలా ఇలా ఇలా!

ఆడగొంతు ౧

మోటు బావి దాకా -

ఆడగొంతు ౨

పాటి రేవు దాకా -

కొందరు

అటు మీరు - ఇటు మేము!

అందరు

అలా అలా అలా! ఇలా ఇలా ఇలా!

[పరుగెత్తే అడుగుల చప్పుళ్లు]

నీలవేణి

కలవాణీ! మంజుఘోషా! రాగిణీ! ఏమర్రోయ్! పారిజాతం! ఒరిగిన పాటిరేవు దగ్గిరికి రండర్రా!

[అందరూ అటు నుంచీ ఇటు నుంచీ ఓయ్ ఓయ్ ఓయ్ అని పరుగెత్తుకుని వస్తారు. మగ గొంతుక గలగలమని నవ్వుతుంది.]

ఆడగొంతు ౧

కార్తిక రాత్రుళ్లా –

అందరు

ఊఁ!

ఆడగొంతు ౨

కరిమ బ్బుంటుందా?

అందరు

ఆఁ!

ఆడగొంతు ౩

నీలమేఘ మాకాశము విడిచి నేల నడుస్తుందో?

మగగొంతు

ఓ!

ఆడగొంతు ౧

నడిచే మబ్బునకూ –

అందరు

ఊఁ!

ఆడగొంతు ౨

నవ్వే పెద వుందా?

అందరూ

ఆ!

ఆడగొంతు

పెదవు లందితే పేద వెదుళ్లే అవరి పాడతాయో!

మగగొంతు

ఓ!

[ఆడా మగా త్వరత్వరగా నృత్యం చేస్తూ చెరో చరణం పాడుతూన్నట్లు]

తెల్లని వెన్నెల్లో
నల్లని మబ్బుల్లూ!
నీలపు మబ్బుల్లూ
నేల నడుస్తాయీ!
నడిచే మబ్బులకూ
నవ్వే పెదవుల్లూ!
నవ్వే పెదవులకూ
మువ్వల వేణువులూ!

[ఒక చిటిక నవ్వులతో కలిసిన నాట్యం చప్పుడు. పాట ఆగిపోతుంది.]

మగగొంతు

పాటిరేవులో పడవుందీ!

నీలవేణి

అది- ఏటవాలుగా వంచకపోతే

కలవాణి

ఎలా గెక్కుతాం?

రాగిణి

ఇలా గెక్కుతాం! [నవ్వుతుంది]

మగగొంతు

అందరు ఎక్కారా?

ఆడగొంతులు

ఆ!

నీలవేణి

పడవ ఒరిగితే భయమేస్తుంది!

కలవాణి

అమ్మయ్యో!

రాగిణి

అమ్మయ్యో!

ఆడగొంతులు

దూకే వాకల ఉదుటుల్లో-
తాకే శాఖల అదటుల్లో -

నావ తడిస్తే -
త్రోవ జడిస్తే -

అందరు

నేర మెవరిదోయ్?

మగగొంతు

నాది!
లేచే తరగల నురుగుల్లో -
వీచే పయ్యెర పరుగుల్లో -
చీర తడిస్తే -
జార విడిస్తే -

అందరు

నేర మెవరి దోయ్?

మగగొంతు

మీది. మీరంతా ఒక వైపు, నేనొక్కణ్ణీ ఒక వైపు....పడవ ఒరగదు. జడియదు. మునగదు. చూద్దామా?

అందరు

అమ్మయ్యో! అమ్మయ్యో!

ఆడగొంతు ౧

ఈ ఒడ్డు దగ్గరనుంచి పడవని సాగనివ్వ గూడదు.

ఆడగొంతు
ఏం? ఒరిగిన కొమ్మల్లో సరంగు చిక్కడతాడా?
[నవ్వుతారు]

మగగొంతు
అప్పుడే చిక్కడ్డాడు.

ఆడగొంతు
సుళ్లు దాటుకొని మళ్లే నావ -
నీళ్లు మీటుకొని తుళ్లే నావ -
నడిపిస్తావా?

మగగొంతు
నడిపిస్తాను!

ఆడగొంతు
వల్లని నా సామీ!

మగగొంతు
హై లెస్సా!

ఆడగొంతు
వల్లని నా సామీ!

మగగొంతు
ఓ లెస్సా!

ఆడగొంతు

హోరుగాలిలో పారే నావ -
పైరగాలిలో పాకే నావ -
నడిపిస్తావా ?

మగగొంతు

నడిపిస్తాను !

ఆడగొంతు

నల్లని నా సామీ !

మగగొంతు

హై లెస్సా !

ఆడగొంతు

నల్లని నా సామీ !

మగగొంతు

ఓ లెస్సా !

[పాట దూరంగా వెళ్ళిపోతూ వెన్నెలలో కలిసి పోతుంది.. నిశ్శబ్దం...ఒక్కసారి వేణువు మ్రోత...]

కార్తిక

రెల్లుపూలా పానుపుపైనా
జల్లూ జల్లులుగా - ఎవరో
చల్లి నారమ్మా ! వెన్నెల చల్లి నారమ్మా !
కరిగే పాలా కడవలపైనా

నురుగూ నురుగులుగా -
మరిగే రాధా మనసూపైనా
తరకా తరకలుగా - ఎవరో
పరచీ నారమ్మా! వెన్నెల పరచీ నారమ్మా!

కడిమి తోపుల నడిమి బారుల
ఇసుకబైళుల మిసిమిదారుల
రాసీ రాసులుగా - ఎవరో
పోసీ నారమ్మా! వెన్నెల పోసీ నారమ్మా!

• • •

వలిగాలి కేలి కౌగిలి నూగు కాళింది
కాలియందెలు గలగలని మ్రోగు -
కెలకున రెల్లులో కొలకున దాగు బె
గ్గురు పుల్గు కను లరతెరచి జోగు -
దరిలేని విరహాన మరుగు చిగురు వెజ్జ
పొరలుచు మంకెనపూవు వేగు -
కనుచూపు మేర దాటిన తేటివల పేర్చ
గా నవమాలతి మేను కాగు -

కడిమి తెరువులు, పొగడ మార్గములు, మొగలి
సందులు, వెదుళ్ల గొందులు సాగి, కోవి
దారసుమముల దారులు దాటి, మరల
తరుణ మురళీ శర న్నిశోత్సవము సాగు!

నిద్రమానె వెన్నెలలు, ఉన్నిద్రరాగ
రేయి నిట్టూరుచు, తమాలవృక్షమూల
సైకత వితర్దికోపరి శ్యామపర్ణ
పాళి పానుపుగాగ నేర్పడె తనంత!

*   *   *

రాధ: ఏమని నిద్రవో వలతురమ్మా గోపికల్ మీరు? బృందారామమ్మున పాలమీగడల వానల్ జారు ఈ రేయి సుస్మేరాస్యమ్మగు శ్యామసుందర ఘన శ్రీమూర్తి కాబోలు వంశీరాగమ్ముల పిల్పులన్ వినరటే —

అంతశిశిరమ్ముకదె సుశిరామృతమ్ము
ఎటుల మరగించునే సఖీ! ఈ విరహము!
తనది కరిమబ్బుమేని సౌందర్యము కదె
నిండు పున్నమి నెటుల పండించు లోన?

దరియుకొలది చాల దవ్వౌను; దవ్వైన
కొలది దరిసి దరిసి పలుకరించు;
నిముసమేని నిలువ నీయదు వేణువు -
పిలుపొ గాని, మేలుకొలుపొ గాని!

# ఏడాది పొడుగునా

[తెలుగునాట ఒక పల్లె _ గోదావరి మండలం లోనిదేమో! ఆ పల్లెలో ఒక కుటుంబం. ఏడాది పొడుగునా ఆ కుటుంబజీవితం _ పండుగలూ, పబ్బాలూ, పొలాలూ, వ్యవసాయపు పనులూ పొంద రైనవి.]

ఆడ మగ గొంతుకలు

కల దొక పల్లె - అది ఏదైతే నేం?
తెలుగు నాట ఉంది - అది ఏ దుంటే నేం?

ఊళ్లో పదిమందీ చెమటోడ్చే వారైతే -
ఊళ్లో పదిమందీ కలిసుండే వారైతే -
అది ఏదైతే నేం? అది ఏదుంటే నేం?

కాలువ ఒడ్డున ఒదిగి నీడ చూసుకొనేదో -
చేలనడుమ పడుచులాగ చేయెత్తి పిలిచేదో -
కొండప్రక్క నిలిచేదో -
తోటవెనక కాస్త కాస్త తొంగి తొంగి చూవేదో-
ఏదో ఒక పల్లె - అది ఏదుంటే నేం?

కష్టసుఖాలూ కలుములూ లేములూ
కలిమి లేములూ కరువులూ బరువులూ

ఏవొచ్చిన గానీ ఎండలై వానలై
ఎదురొచ్చిన గానీ వెన్నెలై చీకటై
నిలబడె నా పల్లె - చిరకాలం నుండీ
అది ఏదైతే నేం? తెలుగు నాటి పల్లి -
అది ఏడుంటే నేం?

ఉన్నా డా గ్రామంలో ఒక భూస్వామి -
పే రేదైతే నేమీ?

అందరికీ అనుకూలుడు ఆ ఆసామీ -
కుల మేదైతే నేమీ?

అల్లుకొన్న దోసపాదు ఆతని సంసారం!
పిల్ల జెల్ల పొలం పుట్ర భగవంతునిపై భారం!

ఒక పురుష కంఠం

అయినా, పేరంటూ ఉండాలి గనుక, ఆ పెద్దమనిషి పేరు రామస్వామి.

ఒక స్త్రీ కంఠం

అతని భార్య పేరు సీతమ్మ.

పురుష కంఠం

ఒక వైశాఖ మాసంలో ఒకనాడు ఆ రామయ్య యింటి వాకిట్లో....

సీతమ్మ

పడవయినా, బస్సయినా, ఈపాటికి రావాలి గదా! ఇద్దరు పిల్లలూ - ఓపలేవిదీ - ఒక్కత్తే వస్తుంది కూడాను.

రామయ్య

రేవుకాడే కాదూ, బస్సు స్టాండు కూడాను. పెద్దబ్బాయి వెళ్ళలేదూ నాగరాజు?

సీతమ్మ

వాడూ పాలేరు కోటయ్యా పొలంలోకి వెళ్ళారు, గట్లూ గనుమలూ బాగు చెయ్యడానికి.

రామయ్య

మరి చిన్నాడు?

సీతమ్మ

నారాయణా?

రామయ్య

ఆఁ

సీతమ్మ

వా డెలా వెడతాడండీ, ఈవేళ పెళ్ళికొడుకును చేస్తే!

రామయ్య

సరే! ఆ పంచె ఇలా పడేయ్, వెళ్ళొస్తా మరి. కోటిగా డొస్తే అక్కడికి పంపు.

[చెప్పుల చప్పుడు వెళ్ళిపోతూన్నట్లు.]

* * *

[కాస్త జనం కలకలం బస్సుస్టాండు దగ్గరలాగ, బస్సు హారన్...బస్సు ఆగిన చప్పుడు..."దిగండి దిగండి" అనీ, "పెట్టె

దింపు" అనీ, "పిల్ల నెత్తుకో" అనీ, "తలుపు తగులుతుంది" అనీ, ఇంకా ఇలాంటి కేకలు తొందర తొందరగా...]

పిల్లవాడు

తాతయ్యోయ్!

రామయ్య

హరి! వచ్చావురా? అమ్మా-వచ్చావా, లక్ష్మీ! సామాను దింపవోయ్! అమ్మా! ఆ పిల్ల నిలా ఇయ్యి. ఇదిగో - కోటిగాడు కూడా వచ్చాడు. బండిలో సామాను పెట్టించరా! అమ్మా! బం డెక్కండి! ఒరేయ్ కోటిగా, ముందు ఇంటికి పరుగెయ్! అమ్మాయీ, పిల్లలూ వచ్చారని చెప్పు.

[బండి నడిచిన చప్పుడు...ఆగిన చప్పుడు.]

*　　　*　　　*

సీతమ్మ

అమ్మా వచ్చావా? కాస్త దిష్టి తీయనీ, లోపలికి వద్దువుగానీ!

పిల్లవాడు

అమ్మమ్మోయ్! నాకు మర ఇంజను నాన్న పంపాడు.

సీతమ్మ

అబ్బో! అబ్బో! దాని మీ దెక్కి వచ్చా వేమిట్రా? ఏదిరా? చూపించు. అమ్మమ్మ నెక్కిస్తావా?....ఆ చంటి దెలా చూస్తోందో - పులుకు పులుకుమంటూ, పిచికలాగ! దాన్ని ఇలా తేవే ఒకసారి.... పిల్లలు చిక్కిపోయారే వే అమ్మాయీ?

లక్ష్మి

వాళ్ళ నాన్నగారికోసం బెంగ పెట్టుకున్నారు....తమ్ము డేడమ్మా - నారాయణ? పెళ్ళి కొడుకుని చేశారా?

సీతమ్మ

ఆ! విడియంవచ్చి పెరట్లో కూచున్నాడు....ఒరే, పెళ్ళి కొడకా! మీ అక్కయ్యొచ్చిందిరా!

[అడుగుల చప్పుడు]

పిల్లవాడు

చిన్న మామయ్యా! నాకు మర ఇంజనుంది. నాన్న పంపాడు.

నారాయణ

అది కూస్తుందిరా? పొగొస్తుందా?

లక్ష్మి

దానికి మర ఇయ్యగానే, వాడి చెల్లి కూస్తుంది. వాడు గుప్ గుప్ మంటాడు. ఒక్క నిముషంకూడా ఆ ఇంజన్ పట్టుకుని వదలడు. ఇక ఆ చంటిది ఏదో కాగితం పట్టుకుని, అది నాన్న ఉత్తర మని ఊఁ ఊఁ అని చదువుతుంది.

సుబ్బమ్మ

[దూరంనుంచి దగ్గరగా వస్తూ] ఏవఁమ్మోయ్ సీతమ్మా! ఏదీ మా కోడలు వచ్చిందట! అందుకే ఊరూ వాడా కలకల్లాడుతూ ఉంది అప్పుడే! నేను రేవు దగ్గిరే ఉన్నాను పడవ వచ్చినప్పుడు.

లక్ష్మి

లాంచిమీద రాలేదు సుబ్బమ్మత్తా! బస్సుమీద వచ్చాం.

సుబ్బమ్మ

మహారాణీ! దేవిమీ దొస్తే నేం?....[పాటలాగ]

ఏరు దాటొచ్చిందో - కారుమీ దొచ్చిందో -
ఎవ రాడబడుచమ్మ? ఎవ రాడబడుచు?

లక్ష్మి

ఏదీ సుబ్బమ్మత్తా - నీ పాట విని చాలారోజు లయింది! పాడుతున్నావా ఇప్పుడు?

సుబ్బమ్మ

ఆ! ఆడే కాలూ పాడే నోరూ ఊరుకుంటాయా? అయినా నా పాటే వినాలా! కూనలమ్మ సంగీతం వింటే పుణ్యం లేదు; వినక పోతే పాపం లేదు.

సీతమ్మ

ఇప్పుడు మా సుబ్బమ్మొదిన కున్న పలుకుబడి మునసబు కరణాలకు లే దీ ఊళ్ళో. సినీమాపాటలు కూడా నేర్చుకుం దీమధ్య! ఏదీ వొదినా! పాడు.

సుబ్బమ్మ

మరి తప్పుతుందా? మా మహాలక్ష్మమ్మను చూస్తే పాట పుట్టు కొస్తుంది కూడా!

ఎవ రాడబడుచమ్మ - ఎవ రాడబడుచు?
ఏరు దాటొచ్చింది ఎవ రాడబడుచు?
కుచ్చులా పల్లకిని కూర్చున్న దీ - లోన
అచ్చంగ రాణిలా అమరున్న దీ!
పరుపు బాలీసుపై ఒరిగున్న దీ!

అన్నలైతే పసిడి అందె లిస్తారు
తమ్ములైతే వేలు సొమ్ము లిస్తారు
పెట్టి పోపేవారు పుట్టింటి వారు
పుట్టింటికే తాను పురుటి కొచ్చింది!

లక్ష్మి

[నవ్వి] అందుకు కాదమ్మోయ్ వస్తా!

సుబ్బమ్మ

అదెంత పేపమ్మోయ్ పిల్లా!

మరదళ్లు అడుగులకు మడుగులొత్తేరు
వదినల్లు కనుసన్న ఒదిగి మెదిలేరు
గౌరవానికి గావి ఘనతకు గావి
తన పుట్టినింటిలో తాను దొరసావి!

అబ్బాయి తాతయ్య అంక మెక్కేను
అమ్మాయి అమ్మమ్మ చంక నెక్కేను
తన పుట్టినింటిలో తాను దొరసావి!
మగనింటిలో ఉంటె మగువ యువరాణి!

ఏం కోడలా! మీ ఆయన్ని తీసుకొచ్చావు కావేం!

సీతమ్మ

అతగాడు సీమకెళ్ళాడు పెద్ద చదువుల కోసం. ఇంకో యేడాదిలో వస్తాడు.

సుబ్బమ్మ

ఏమి చేమిటీ? పెద్ద చదువుకే? ఔను మరి. అతగాడి కేం? పెద్ద ఉద్యోగాలుకూడా చేస్తాడు. అయినా, అందరికీ ఆ అదృష్టం పడుతుందా? మెరకవీథి కామయ్యగారి కొడుకు వల్లమాలిన పరీక్షలిచ్చాట్ట! కాని, మేస్టరీపనే చేస్తున్నాట్ట: నే నన్నానుకూడా - ఇంత పట్టై నామాలు పెట్టడమూ ఈ ప్రసాదం కోసమేనా అని. అయితే లక్ష్మి - పురిటికీ కాక, పండక్కీ కాక, ఎందుకొచ్చినట్టు పుట్టింటికి?

లక్ష్మి

మా తమ్ముడు నారాయణ పెళ్ళని వచ్చాను - రేపు పంచమి నాడు.

సుబ్బమ్మ

ఏమి చేమిటీ? ఏం రామస్వామన్నయ్యా. చెప్పేవే కావు వప్పన్నాలవీ! మేనరికమేనా?

రామయ్య

ఆ!

సుబ్బమ్మ

అనుకున్నా! చాలా సంతోషం. చిలకలాంటి పిల్ల! ఔనా? ఏం నారాయణా? నీ పెళ్ళికి పాటలు పాడొద్దూ నేను? [అందరూ నవ్వుతారు] పెళ్ళినుంచి వచ్చాక ఇక్కడ వేడుకలు పెట్టించు. అన్నయ్యా! నే వెళ్ళొస్తా! [వెడుతుంది]

రామయ్య

ఇక మనం పిలుపులు పెట్టుకో నక్కరలేదు. పెళ్ళికార్డులూ

అచ్చువేయ నక్కరలేదు. మరో గంటలో గ్రామమంతా తెలుస్తుంది. మంచినీళ్ళబావి దగ్గరకే వెడుతుంది కూడా నరాసరి!

* * *

[మంచినీళ్ళబావి దగ్గర...నీళ్లు తోడే చప్పుడు - బట్టలుతికే చప్పుడు - మొదలైనవి. పాట - సంభాషణలో-ప్రశ్నోత్తరాలు]

"సూరమ్మా పేరమ్మా చూశారమ్మా?
ఔరా! పెళ్లంట మన నారిగాడికీ!"
"ఆఁ! నారిగాడికా?"
"ఊఁ! నారిగాడికే!"
"ఏ ఊరో?"
"గుంటూరు!"
"ఎవరమ్మా పిల్లా?"
"కోదండం కూతురే - గోవిందమ్మా!"
"మేనరికంటే?"
"అవ్వ! మెల్లకన్ను కాదుటే?"
"మెల్లకంటి కైదెకరాల్
పల్లపు చేనుకి చెల్లు!"

"కట్నాలూ కానుకలూ
కావలి పోవాల్ఛాయా?
బోలెడంత చదువు చదివి
పొయ్యే కాలమా?"

"మొగుడి కన్న పెళ్లామే
మూరెడు పొడుగు,
కావలిస్తే ఆ సంగతి
కాంతా న్నడుగు!"

గోవిందమ్మ

ఏం విడ్డూరా లర్రా! మెల్లక న్నేమిటి దానికి? నే నెరగ నేమిటి పిల్లవి? బారెడేసి కళ్లూ -

పేరమ్మ

మూరెడేసి పళ్ళూ! ఊఁ! [బట్ట ఉతుకుతూన్న చప్పుడు]

గోవిందమ్మ

ఇదిగో ఇల్లాగే మరి కాస్తపేపటికి దానికి సొట్టకాళ్ళూ లొట్ట ముక్కూ కూడా అంటగడతారు.

పేరమ్మ

నేనేం అవలే దమ్మోయ్! అలా కోపంతో నా మీద పిళ్లా య్యేవు. నాకేం మధ్యవ? దానికి దొప్ప చెవు లయితే నాకేం - దోనె కడు పయితే నాకేం? నా అందానికి నే నొకరి ననడం కూడానా?

గోవిందమ్మ

మనసులో ఉన్న మన కోరికనుబట్టి మాటలుకూడా వచ్చే స్తాయి. కాస్త వచ్చగా ఉంది రామస్వామి సంసారం. కొడుకులూ కోడళ్ళూ కూతుళ్ళూ రత్నమాణిక్యాలు.

పేరమ్మ

నాకేం కోరికమ్మోయ్ ఆ పిల్లకి మెల్లకన్ను కావాలని? అంతగా కోరికే ఉంటే, పోయిన మొగుడే రావాలని కోరుకొందును.

గోవిందమ్మ

కోరుకునే దల్లా జరుగుతుందా?

సుబ్బమ్మ

సినీమాతారో సీమరాణీయో కావాలని కోరుకుంటే జరుగు తుందా?

పేరమ్మ

ఊరుకోండి మీరందరూ! కాలాయిగాడికి పోలాయిగాడు తోడన్నట్లు! [వెళ్ళిపోతుంది]

గోవిందమ్మ

ఇంతకూ గడియకో గడియకో పెళ్ళివారు వచ్చేస్తారుగా - గృహప్రవేశానికి! పెళ్ళికూతురు నందరూ చూడొచ్చు.... అదుగో - పెళ్ళివారు - రానే వొస్తున్నారు.

* * *

[బళ్ళ గంటల చప్పుడూ, పల్లకీ పాట]

మొయ్యర అమ్మోర్ని మొయ్ !
మెల్లగ - ఆ - మెల్లగ !
మేనాపల్లక మొయ్యర !

పాటవింటూ ఊగెరా
ఆ పైర గాలికి పువ్వులా !
దాటుకుంటూ సాగెరా
ఆ యేటి నురగల పిట్టలా !

ఆ పైరగాలికి పువ్వులా
ఆ యేటి నురగల పిట్టలా ! .... మొయ్యర !

జారెరా ఒయ్యారి కలలూ -
దోర పెదిమల నవ్వులా
మొయ్యరా ! దారాన ముత్యం
మోస్తరు - అమ్మోర్ని మొయ్ !

ఉయ్యాలలా ఒయ్యారముగ
మొయ్యోస్ ! పల్లకి మొయ్ !

మన పాటవింటూ కరిగెరా
మంచు తడిసిన చుక్కరా !
ఏటికెరటం అంచుపై దూకేటి సెందర వంకరా !
ఏటిపై నెలవంకరా - గెంతేటి పిల్ల జింకరా !

దిలాసగా మొయ్యండిరా ! కులాసగా మొయ్యండిరా !
పెళ్లికూతురు కళ్లనుంచీ త్రుళ్లిరాలే సుక్కరా !
మొయ్యరా దారాన ముత్యం మోస్తరు-అమ్మోర్ని మొయ్ !
చల్లగా ఆ సాపుగా ఆ-సవ్వారి పాపం మొయ్యరా !
మొయ్యరా అత్తోరి యింటికి-అమ్మోర్ని పల్లకి మొయ్యరా!

* * *

రామయ్య

శాస్తుర్లుగారూ ! వర్షాలు ఎగబెట్టేటట్టున్నాయి ఈ యేడు !

శాస్త్రి

అలా ఊరుకుంటామా ? ఎందు కెగబెట్ట నిస్తాము ?

కోటయ్య

క్షేమగ్గా అన్నారు. తమ రూరుకోగూడదు బాబూ ! కలగజేసుకోవాలి.

నాగరాజు

ఏం ? [నవ్వుతూ] శాస్తుర్లుగారు మబ్బుల్ని పిలిపించి, వాటిని పిండించి, కురిపిస్తారా ఏమిట్రా కోటయ్యా ?

రామయ్య

ఊరుకోరా అబ్బాయి ! పెద్దల్తో అలా మాట్లాడతా వేమిటి ? ఈ ఇంగ్లీషు చదువు లొచ్చాయి శాస్తుర్లుగారూ ! వీళ్ళకి దేవిలోనైనా నమ్మకం అఘోరిస్తే బాగుండును.

శాస్త్రి

వాళ్ళు కురిపిస్తున్నారటగా వర్షాలు అమెరికాలో అక్కడా!

నాగరాజు

కురిపిస్తున్నారు గాని, ఉపవాసా లుండీ ఉప్పేంది తినీ కాదు.

శాస్త్రి

మరేం చేసి?

నాగరాజు

శాస్త్రప్రకారం గొప్ప ప్రయోగాలు చేసి -

శాస్త్రి

మేం మన ధర్మంప్రకారం గొప్ప ప్రయోగాలు చేసి, చూసి -

నాగరాజు

మంత్రాలు చదివీ పాటలు పాడీ వానల్నీ వెన్నెల్నీ రప్పించలేం.

కోటయ్య

మరి, పిలిసినప్పు డల్లా యెన్నెల్లూ, కావల్సినప్పుడల్లా వానలూ వివీమాల్లో రావటంలా? అలా గనకండేం నాగరాజు బాబూ! యెనక ఓ పాలి ఇట్టాగే వాన లెగేసినయ్! అప్పు డేం చేశామా? గొంతెమ్మ జాతర చేశాం. వందేల దోసిళ్ళు పల్లించినాం. ఓ! ఆపశంగా - సూసుకోండి - ఒక్కపారి కొండకు పిల్లడి పోయింది. అంతే!

రామయ్య

ఉంగ్రా కోటయ్యా!! ఉపన్యాస మివ్వడమంటే వీడిక్కూడా మహా సరదా.

కోటయ్య

పిత్తం.

రామయ్య

శాస్త్రిగారూ! మీరు విరాటపర్వం చదివిస్తున్నారు గదా వానలకోసం.

శాస్త్రి

అది చాలలేదన్నమాట!

నాగరాజు

హమేషా చదవటంవల్ల దాని పవర్ పోయిందా?

శాస్త్రి

పోయినా పోతుంది. ఇహ మనం శివసహస్రఘటాభిషేకం చేయిస్తే -

రామయ్య

అలాగే చేయిద్దాం. ఇంతకూ నా నమ్మక మేమిటంటే, మన దుశ్చింతలూ పాపకార్యాలూ పెచ్చుపెరిగిపోతూంటే, ఇలాంటి ఆపత్తులు వస్తూంటాయి. ఆమధ్య బీహారులో భూకంపం వచ్చినప్పుడు మహాత్ముడు ఏమన్నాడు? "అస్పృశ్యత అనే దోషం పాటిస్తున్నాం గనక, అది, భగవంతుని ఆగ్రహసూచనగా వచ్చింది" అన్నారు. కనక, మనం అర్థంలేని ఆచారంగా ఏమి చేసినా లాభం లేదు. నిష్కల్మషంగా మనస్సును ఉంచుకొని, ఆ పరమేశ్వరుణ్ణి పిలిస్తే, ఆయన అనుగ్రహిస్తే, వర్షం కురుస్తుంది - "ఓ దేవుడా" అని విశ్వాసంతో చిన్న పిల్లల్లాగ.

* * *

[కొంత దూరాన్నుంచి పాట వినిపిస్తుంది]

వానదేవుడా ఓ వానదేవుడా!
రాణతోను రావయ్య వానదేవుడా!
రాజులాగ రావయ్య వానదేవుడా!

మిన్నంతా నీ తేరు వానదేవుడా!
మేఘాలు గుర్రాలు వానదేవుడా!

మెరుపులైతె జెండాలు వానదేవుడా!
ఉరుములైతె బాజాలు వానదేవుడా!

దగపుట్టి భూదేవి వగరుస్తు చూస్తుంది!
కడుపులోని పంటలు పైకి తీసి ఇస్తుంది!

జాలిపుట్టి రావయ్య వానదేవుడా!
చల్లన్ని నీరియ్యి వానదేవుడా!

ఏళ్లకీ కాళ్లొచ్చి మళ్లపైకి పాకాలి!
చెరువులకీ వొళ్లొచ్చి వేలపైకి దూకాలి!

[పాట ముగియగానే వాన కురిసినట్లూ, మేఘాలు ఉరిమినట్లూ చప్పుడు]

ఒక పిల్లవాడు

వానా వానా చెల్లప్పా! వాకిలి తిరిగే చెల్లప్పా!

రెండవ పిల్లవాడు

ఈ కాగితంతో పడవచేసి పెట్టు తాతా!

రామయ్య

ఒరేయ్ తడవకురా! నువ్వు పోయి అమ్మమ్మను పిలు. బిడ వన్నకు పూజ చెయ్యాలి....ఒరేయ్ కోటయ్యా! ఈలోగా నాగలి కట్టు! ఇదుగో - ఇలా చూడు! విన్నే! మనమ్మాయిని పిలు - లక్ష్మిని!

సీతమ్మ

ఆ!....లక్ష్మీ!

రామయ్య

ఇక్కణ్ణుంచి పిలుస్తా వేం రాగం తీస్తూ? లోపలికి వెళ్లి పార్వతిని కూడా పిలు. పసుపు కుంకం మంగళహారతీ - అన్నీ తెచ్చావా? ఒరేయ్ చిన్నబ్బాయి! కొత్త కోడలిని ఘోషాలో ఉంచా వేమిట్రా?

కోటయ్య

పిన్న కోడలు గారూ వొచ్చా రండి!

రామయ్య

ఏరా కోటయ్యా! నువ్వూ కొత్త బట్టలు కట్టుకున్నావా?

కోటయ్య

[సిగ్గుగా] చిత్తం!

రామయ్య

అరికుంకా! కోటయ్యా! శీఘ్రగా తయారయావురా!

నాగరాజు

వాడి డ్రెస్సూ వడకా అన్నీ మార్చేశాడు నాన్నా ఈమధ్య!

కోటయ్య

సుబ్బమ్మక్క గారికాడ పాటలు కూడా నేర్చుకుంటున్నా నండీ.

రామయ్య

ఏడిశావులే! ఊఁ! చూస్తారేం? కొమ్ములకీ, కాళ్లకీ, కాడికీ, మేడికీ కాస్త వసువు పూసి కుంకం పెట్టండి!

పార్వతి

వదినా! మీరు మంగళ హారతి పాడండి!

సీతమ్మ

ఊరికే పాడ్డం కాదు. ఆడపడుచుకి మంగళహారతి పళ్లెం వస్తుంది.

రామయ్య

ఆ! అలాగే! దానికేం?

[కోడళ్లూ కూతురూ పాడతారు]

ఏరువా కమ్మకీ ఏమి కావాలి?
ఎఱ్ఱనెఱ్ఱని పూలమాల కావాలి!

ఏరువా కమ్మకీ ఏమి కావాలి?
ఎరుపు తెలుపుల మబ్బు పెంఢ కావాలి!
కాపు కర్రుచ్చుకుని గట్టు నిలవాలి!
కొడుకు మేడుచ్చుకొని కొంగ్ర దున్నాలి!
బసవన్న తల ఊచి పాటు చెయ్యాలి!
పాలేరు పండించి పండుకోవాలి!

ఏరువా కమ్మనూ ఏమి కోరాలి?
గరిసెలందూ కొత్త సిరులు నిండాలి!
కొట్లలోపల కొత్త కొలుచు నిండాలి!
నట్టింట మహాలక్ష్మి నట్టు వాడాలి!
పాడిపంటలు కోరి పరవసించాలి!

రామయ్య

కోటయ్యా! కొబ్బరికాయ కొట్టి మొక్కూకో!

[కొబ్బరికాయ కొట్టిన చప్పుడు]

కోటయ్య

తండ్రీ బసవన్నా! నీదే సలవ!

రామయ్య

ఒరేయ్ చిన్నబ్బాయి! కొత్త గిత్తల్ని నువ్వు తోలకు. కోటయ్య తోల్తాడు. వాడి కలవాటు. జాగ్రత్త! నీకు తొందర! కర్రు ఎడ్ల కాళ్లల్లో దిగేశావు సుమా!

సీతమ్మ

మీరుకూడా అందాకా వెళ్లిరండి। ఓ కొత్తకోడలా। నువ్వెదురుగా రా।

* * *

"గున్నాసారి గున్నమ్మ।
ఓ గున్నసారీ గున్నమ్మా।
ఊకుపు లూడ్చేకాడా నీకూ
ఒడినిండా పసు పెందుకే? గున్నాసారి గున్నమ్మా।"

"గొప్పు తవ్వే కాడ నీకు
కొత్త పంచె లెందుకురో? కోరమీసం కోటయ్యా।"

"బందలో నిలిసే కాడ నీకు
సందా లందెలు ఎందుకే? గున్నాసారి గున్నమ్మా।"

"చేలూ దున్నే కాడ నీకు
వాలూ గోసీ లెందుకురో? కోరమీసం కోటయ్యా।"

"కలుపు తీపే కాడా నీకు
కంటికి కాటికి ఎందుకే? గున్నాసారి గున్నమ్మా।"

"కత్తువబట్టే కాడ నీకు
కాశీకోక లెందుకురో? కోరమీసం కోటయ్యా।"

"మద్దేన్నం మరి దప్పికేస్తే
సల్ది గెంజీ తాగేవో? గున్నాసారి గున్నమ్మా।"

"కొండెక్కినా సూరీడూ
ఎండెక్కినా కోటయ్యో! కోరమీసం కోటయ్యో!"

నారాయణ

ఏయ్ కోటయ్యా! నువ్వు పని చూసుకుని ఇంటికిరా - నే వెళ్తాస్తా. ఇవాళ ఇంట్లో పూజలూ అవీ ఉన్నాయి.

కోటయ్య

[నవ్వుతూ]! ఆడంగులకి కాదు బాబూ ఇయ్యాళ పూజలు? ఎల్లుండి, మరి, ఎల్లేలోగా పొటిగరాపు తియ్యరూ నాకు? ఈతోపు కాడ తీస్తా నన్నారుగా!

నారాయణ

అలాగే! రేపు తీస్తా.

కోటయ్య

ఇయ్యాళ కొత్తపంచెలూ అయీ కట్టి, నేనూ గైరమ్మా ఇట్లా నిలబడతాం.

గైరమ్మ

నాకొద్దు కోటయ్యా! ఓ ఫుగాకు పొయి ఇలా పడెయ్యి.

కోటయ్య

ఫుగా కిత్తే ఏమిత్తావ్?

గైరమ్మ

ఛీ పీ జిమ్మడ! ....కొత్త పెళ్లికూతురుగారు ఇక్కడే ఉన్నారు కామోసు!

కోటయ్య

మరి పనొగ్గేసి చినబాబుగారు ఇంటికి పరుగెత్తే రెందు కంటావ్? అందుకే! వరసాలకే!

* * *

[లోపలనుంచి స్త్రీలు పాడే శ్రావణ శుక్రవారం - మహాలక్ష్మి మీద పాట]

ఓ దేవి నీ ముందోల ఒదిగియున్నా మమ్మ!
ఏదేని వరమడుగ ఎంతవారము తల్లి!
పాదాల తల లనే పారిజాతము లుంచి -
మోదాన బాష్పాల ముత్తెసరు లుంచి -

జనని దయారస హృదయ!
జలజవసీ నిలయ!
జయా జయా శుభాశ్రయా!
జయా జయా హరిప్రియా!

నొసట కలకాలమ్ము పసుపు కుంకుమ లుంచి -
నిసువు చిరునగవు దివ్వెల పీట వెలిగించి -
పసిచెదని సంసార మందార ముంచి -
బసచేసి మాయింట మసలేటి మహాలక్ష్మి!

సీతమ్మ

ఏం సుబ్బమ్మోదినా అప్పుడే వచ్చావు! భోజన మయిందా?

సుబ్బమ్మ

ఏం భోజనంలే సీతమ్మొదినా! ఏదుం తిన్నా ఏకాశి - వందుం తిన్నా పరగడుపే - అన్నట్టుంది నాపని.

సీతమ్మ

ఏం? అలాగంటున్నావు?

సుబ్బమ్మ

ఏముంది? వ నంటే ఒళ్లు బద్ధకిస్తుంది; పాయవ మంటే పరుగెత్తుతుంది.

సీతమ్మ

[నవ్వుతూ] వయమే కాదూ!

సుబ్బమ్మ

ఏమిటి విశేషం? గుమ్మాలకు పసుపూ కుంకాలూ -

సీతమ్మ

శ్రావణమాసం కాదూ మరి! శుక్రవారం నోములూ అవీ -

సుబ్బమ్మ

అవును. లోపల మహాలక్ష్మిమీద ఎవరో పాట పాడుతూంటే వినిపించింది; ఇలా వచ్చాను. ఎవరమ్మా పాడేది?

సీతమ్మ

మా అమ్మాయీ చిన్నకోడలూ!

సుబ్బమ్మ

అయ్యో! నీయిల్లు బంగారం గాను! కొత్త పెళ్లికూతుర్ని తీసుకెళ్ల లేదమ్మా పుట్టింటికి వాళ్లు?

సీతమ్మ

వాళ్లొచ్చారు చంద్రాన్ని పంపమని. మేమే పంపం అన్నాం. అమ్మాయికూడా ఇక్కడుంది కాదూ!

సుబ్బమ్మ

అవునుమరీ. ఇద్దరు కోడళ్లూ కూతురూ కలిసి పూజ చేసు కుంటే, కలకల్లాడుతూ, ముగ్గురమ్మల్లాగ.... వాళ్లందరూ ఏరి?

సీతమ్మ

లోపల పనులు చేసుకుంటున్నారు.

సుబ్బమ్మ

చిన్నకోడలూనా?

సీతమ్మ

ఆ!

సుబ్బమ్మ

అప్పుడే పనులు చేయిస్తున్నావూ? అవునుమరీ! చేయించాలి. "దంచక్క కలగవే ధాన్యరాశుల్లు - వంచక్క వంగరే పవిత కోడళ్లు" అని ఊరికే అన్నారా?

సీతమ్మ

అదక్కండానే అన్నిపనులకీ అడ్డుపడుతుంది చంద్రం. నేనే వద్దంటున్నాను.

సుబ్బమ్మ

అయినా పట్నవాసపు పిల్ల. చదువుకుంది కూడా. కొంచెం సుకుమారి మరి.

సీతమ్మ

అదేం లేదు పాపం! ఇంకా మన నారాయణే ఎప్పుడూ వదలకుండా తనతో కూచో మంటాడు.

సుబ్బమ్మ

అలా చేయగూడదు వాడు. "ముద్దుచేసిన కుక్క మూతి కరిచే, చనువు చేసిన ఆలు చంక నెక్కే" అని. నువ్వెరగని దేముంది?

సీతమ్మ

[నవ్వుతూ] నువ్వెరగని దేముంది? మరి నీ చిన్నప్పటి ముచ్చట్లు మరిచి పోతే తప్ప. కుర్రాళ్లూ - కొత్త కాపరం అలా అనిపిస్తుంది. అస్తమానం పాడమంటాడు పెళ్లాన్ని. చాలా బాగా పాడుతుంది లే!

సుబ్బమ్మ

అయ్యో! వీయిల్లు బంగారం గానూ! చెప్పావు కావూ!

సీతమ్మ

మొన్న పెళ్లినాటికి వాళ్లన్నయ్య ఓ పాట వ్రాశాట్ట! ఎంత బాగా పాడిం దనుకున్నావు!

సుబ్బమ్మ

పిలమ్మా చంద్రమ్మని! నేనే పిలుస్తా!.....ఓ చిలకమ్మోయ్! రామచిలకా! విన్నేవమ్మా చంద్రమ్మా! ఏమిటి - రా! ఇలారా!

నువ్వు వెన్నెల వినవకఁవు. చదువుల వరవ్వతివి. పాటల వీణవు కూడా నట!

చంద్రం

నాకేం రాదండి సుబ్బమ్మగారూ!

సుబ్బమ్మ

ఇదేమిటి - బొడ్డుకోపి పేరెట్టావు! నా మొహానికి గార్లు ఏమీ వద్దు. ఎంచక్కా 'సుబ్బమ్మ పిన్ని' అను. ఏదీ ఆపాట? అదేమిటి - మీ అత్తగారు చెప్పింది?

సీతమ్మ

నాకేసి చూస్తా వేమిటి చంద్రం? పాడు - మీ అన్నయ్య వ్రాసిన పాట.

చంద్రం

నామీద కాదది! తుంగభద్రమీద. వరదాకి పాడించాడు అన్నయ్య!

సీతమ్మ

ఏదో కానీ!

చంద్రం

వినవమ్మా చెల్లెలా!
గుణభద్రా! తుంగభద్ర!
వినవా నా చెల్లెలా!
గంగా యమునల తోడు -
గౌతమికే నైదోడు -

తుంగభద్ర విలుచు నాదు
బంగారపు పీడు!
వినవమ్మా చెల్లెలా!
గాలులా ఉయ్యాల లూగు
వేళలు చనె నమ్మా!
బాలపై సయ్యాట లాడు
ప్రాయ మేగె నమ్మా!
పోయిన జీవనం మళ్లీ
పొందవు సుమ్మీ చెల్లీ!
ఈయిల పండించుటయే
నీ ధర్మము తల్లీ!
వినవమ్మా చెల్లెలా!
గుణభద్రా! తుంగభద్ర!
పొంగదు ఉప్పొంగదు కడు
పుణ్యశీల దయాలోల!
రంగ దాంధ్ర కర్ణాట ధ
రాంగన ముత్యాల మాల!

సుబ్బమ్మ

హమ్మ నా తల్లీ! ఎంచక్కా పాడావు. ఇంక నా నో రడి పోయింది. పాడితే వొస్తే యిహ యీ వూళ్లో!

సీతమ్మ

ఏ పాట కేం? అలా గంటావు గాని....మళ్లీ రా వొదినా!

సుబ్బమ్మ

తప్పకుండా వస్తాను. ఆ పాటలు నేర్చుకోవాలి.

* * *

ఒక మనమడు

తాతయ్యా! అప్పుడు చేశారు ఉండ్రాళ్లూ అవీ ఈ దసరా పండక్కి చెయ్యరేం?

రామయ్య

ఉహుం! అవి విఘ్నేశ్వరుడుకి ఇష్టం.

మనమడు

మన కిష్టమైతే?

రామయ్య

చేసుకోవచ్చు.

మనమడు

తాతయ్యా! అప్పుడు పూజ చేయించారు - ఆ ముసలాయన! ఆయనది నిజం కడుపేనా?

రామయ్య

[నవ్వుతూ] ఆ!

కోటయ్య

చిన్న మనమడుగోరు పూజ్జేస్తున్నప్పుడు మద్ది మద్ది ఆకామయ్యగోరి పొట్టమీద ఓ పువ్వు వేసేవాట్ట సరదాకి. ఆ పొట్టమీదే యేలెట్టి

పొరపడం కూడా. పూజ అ త్తమానం ఆయన కళ్లు దానిమీదే ఉన్నాయి. ఈపాలి ఆయన బొడ్లో యే లెడతా నన్నారు నాతో. వొద్దు బాబూ! దాన్లో తేలం డన్నాను.

రామయ్య

ఏడిశావులే వాగుడు! నేర్పి పెడుతున్నావా ఇల్లాంటివి పిల్లలకి? ఏదిరా తాతయ్యా దసరా పాట!

మనమడు

బట్ట లవన్నీ వేసుకొవి. బాణాలు పట్టుకోందే పా లెల్లా వస్తుంది?

రామయ్య

పర్వాలేదులే! పాడండ్రా! అందాకా ఉత్తటోపీ పెట్టుకొవి. ఒరే కోటయ్యా! ఆమూల ఉన్న బాణా లియ్యి!

మనుమలు

పిల్లవాళ్లకు పెట్టు పప్పు బెల్లాలు!

అయ్యవారికి చాలు అయిదు వరహాలు!

రామయ్య

భేష్ భేష్! పుస్తకాలకి పూజలూ అవీ చేశారా బాగా?

మనమడు

పూజ చేస్తే చదు వక్కర లేదా తాతయ్యా?

రామయ్య

ఆరి కుంకా ! చదవాల్రా !

మనమడు

తాతయ్యా! వెన్నెల పువ్వొత్తి ఆడుకుందామా? నువ్వు వస్తావా?

రామయ్య

అమ్మో ! నే నాడలేనురా ! ఇటూ అటూ తిరగలేను. తాతను కామా ? నా క్కనపడదు కూడా.

మనమడు

నీ కళ్లజోడు నేను పెట్టుకు చూశా. ఏం కనపడదు. అది తీసెయ్య గూడదూ హాయిగా ?

రామయ్య

[నవ్వుతూ] వద్దురా ! నీ రాదుకోండి !

మనమడు

అదుగో ! అమ్మా చిన్నత్తయ్యా !

లక్ష్మి

అదేమిట్రా ఆ టోపీలూ మీరూ ? పెద్ద ఉద్యోగస్థుల్లాగ.

మనమడు

పాట పాడ్డానికి పెట్టుకున్నాం. అమ్మా! నువ్వూ చిన్నత్తయ్యా వెన్నెల పువ్వొత్తి పాట పాడరూ ? మేం ఆడుకుంటాం.

లక్ష్మి

అలాగే కాపీ:

[పాట పాడతారు]

వెన్నెలా, వెన్నెలా, వెన్నెలో - ఓ
వెన్నెల్లి పూవత్తి వెన్నెలో: - ఓ
రెల్లు పూలా వత్తి వెన్నెలో - ఓ
మల్లెపూలా వత్తి వెన్నెలో - ఓ

మల్లెల్లో కనబడదు వెన్నెలా - ఆ
తెల్లని పూవత్తి వెన్నెలా:
మొల్లల్లో కనబడదు వెన్నెలా - ఆ
తెల్లన్ని పూవత్తి వెన్నెలా - ఆ

పాలకడలీ మరిగి వెన్నెలో - ఓ
నేలంత నురుగుల్లై వెన్నెల్లో:
కైలాసమూ కరిగి వెన్నెలో - ఓ
బైలంత ధూళులై వెన్నెలో - ఓ

ఎవరు విసిరేరమ్మ వెన్నెలా?
పాల, నురుగుల్లో కనబడదు వెన్నెలా: ఆ:
ఎవరు విసిరేరమ్మ వెన్నెలా?
వెండి, ధూళుల్లో కనబడదు వెన్నెలా: ఆ:

రామయ్య

బావుందర్రా: మీ రాడుకోండి: కోటయ్యా: ఓసారి కర్రి లాతే: నేనూ రావిచెట్టుకాడి కెళ్లొస్తా. రామశాస్త్రిగారు పురాణం

చెపుతున్నారు. కోటయ్యా! నువ్వు ముందు పరుగెత్తి కెళ్లి రంగయ్యని సిద్ధంగా ఉండమను.

మనమడు

తాతయ్యా! కోటయ్య రంగయ్యమీద రెండుపాటలు చెప్పాడు.

రామయ్య

ఏమిట్రోయ్ అవి? పాడు త్వరగా!

మనమడు

రంగయ్య రంగయ్య!
నీ ఒళ్లు పెద్ద దుంగయ్య!
నీ జపం చూస్తే కొంగయ్య!
నీ కాల్కింద గొయ్యయ్య!

రామయ్య

ఆరి గాడిదలూ!

మనమడు

రామశాస్త్రి భారతం పురాణం చెప్తుంటే
రావిచెట్టు ఊకొట్టు; రంగయ్య గురుపెట్టు!

[అందరూ నవ్వుతారు]

రామయ్య

ఆరి! కోటయ్యగాడిని తన్నాలి. ఇలాంటి పాటలు చెపుతున్నాడా? నే వెళ్లొస్తా: లోపలికి పిల్లల్ని తీసికెళ్ల అమ్మాయ్!

[నడిచి వెడుతున్నట్టు చెప్పులు చప్పుడూ, కర్రచప్పుడూ]

* * *

[దూరాన్నుంచి పురాణం వినబడుతూంటుంది]

రామశాస్త్రి

అప్పుడు, ఆ కార్తీకమాసంలో, ఆ క్షీరాబ్ధిలో, ఆ శేషతల్పం మీద నుంచి సాక్షాత్తూ శ్రీ మహావిష్ణువులు యోగనిద్రనుండి మేల్కొన్నారు. అప్పుడు ఏం జరిగిం దయ్యా! మొదట కాస్త ఆ నీలమేఘంలాంటి ఒళ్లు విరుచుకున్నారు. ఆ ఒత్తిడికి ఆదిశేషువు వెయ్యి తలలూ రవంత ఊగాయి. తర్వాత ఆవులించారు. అప్పుడు ముక్కోటి దేవతలూ ఇట్లా చిటికలు వేశారు. అప్పుడు కళ్లు తెరిచారా ప్రభువులు. "సుఖంగా నిద్రపోయారా" అని సప్తఋషులూ కుశలప్రశ్న వేశారు. ఆ! అన్నట్టు చిరునవ్వు నవ్వారు ఆ విష్ణుమూర్తి. అప్పుడు లేవడానికని, కుడిచెయ్యి కాస్త శేషువుమీద ఊనే టప్పటికి, ఒక్కసారి ఆ అనంతుడు - అంటే ఆదిశేషువు - కుదించుకుపోయి, పడగలు కాస్త ఒకసారి ముడుచుకున్నాడు. తర్వాత లేచి కూర్చుంటే, ఆ స్వామి వీపుమీద పాముకుబుసం ఉల్లిపొరలాగ అంటుకుని ఉంది. ఏదీ - వేంకటశాస్త్రీ చదువు - ఆ పద్యం - కాశీఖండంలోని పద్యం.

అభినవోన్మేషజం బైనట్టి తొలిచూపు
కౌస్తుభాలోక రేఖలకు నలగ -
సాంగభంగంబైన యావులింతకు, వ్రేల్వ
లంగుళీ స్ఫోటనం బాచరింప -
సౌఖశాయనికులై సంవర్త భృగ్వాది
మునులు హస్తాంభోజములు మొగుడ్ప -

ధృత చేతనంబులై దివ్యాయుధంబులు
జయ జయ ధ్వనులతో సంస్తుతింప -
కలువరేకులబోలు పెంజిలువరేని
అరిది కుబుసంపుపొరలు మైనంటియుండ -
నిదుర మేల్కాంచి కూర్చుండె ఉదధినడుమ
విష్ణు డఖిలేశ్వరుడు శరద్వేళయందు ।

* * *

రామయ్య

ఏం? ఈవేళ ఇల్లు సందడి లేకుండా ఉంది?

సీతమ్మ

ఏముంది? అబ్బాయిలు కుప్పనూర్పుల కెళ్లారు. దక్కీలూ దమ దమ బళ్లూ అవీ కొనుక్కుందామని కోటయ్యని తీసికొని, మనమలు వెళ్లారు....అదుగో మాటలోనే వస్తున్నారు.

[తాతయ్యా - అమ్మమ్మా - అని పిల్లలు కేకలేస్తూ వస్తారు]

మనమడు

ఇది నీకోసం కొన్నాం తాతా - ఈ రంగు కళ్ళ జోడు.... అమ్మమ్మా! ఇదిగో - ఇది నీకు - ఈ తాడెక్కే బొమ్మ! .... తీసుకో!

సీతమ్మ

బాగుందిరా! సరిగ్గా మీ తాతయ్య లాగ.

పిల్లలు

తాతయ్య తాడెక్కే బొమ్మోయ్! [చప్పట్లు కొడతారు]... తాతయ్య తాడెక్కే బొమ్మోయ్!

మనమడు

ఈ సంగీతపు పెట్టె అమ్మకి.

రామయ్య

సరేనర్రా! అన్నీ బాగున్నాయి.

సీతమ్మ

తీర్థం బాగుందా?

మనమడు

ఓ! పెద్ద బుట్టబొమ్మ లొచ్చాయి. పెద్ద మామయ్య లాగ ఉన్నాయి. రథం ముందర ఆడాయి. కాశీపటం - గారడీ - అన్నీ అన్నీ!

రామయ్య

అబ్బ! చాలురా!

మనమడు

ఒకడు మొహానికి సున్నం పూసుకుని, హాట్ పెట్టుకుని, ఆడాడు.

నారాయణ

వాడు మీ నాన్నలాగ ఉన్నాడు కాదూ?

సీతమ్మ

అలా అనకురా! వాళ్ళ కోపం వస్తుంది. ఏమర్రా! ఆడ

పిల్లలూ మీరూ అందరూ త్వరగా భోంచేసి పడుకోవాలి, పొద్దున్నే లేచి తలంటుకోవాలి. గొబ్బిళ్ళ పూజ చేయాలి....[పిల్లలు ఊఁ ఊఁ అంటారు]....లోవ లేదో అమ్మాయీ చిన్న కోడలూ లా గుంది - ఆ కూనిరాగాలూ అదీ! అమ్మాయే - ఏదో పాడుతూంది, మరదలి మీద!

[పాట - లోపలినుంచి]

చెప్పవే మరదలా చెప్పవే! ఈ చిక్కువిప్పి నీవే నిజం!
తప్పలేదు, నెల దప్పెనో, నీ చెరగు తిరగదేమో బుజం!
కళ్ల ఆవైపు తిప్పకే! ఉఁహూ! కాస్త చూడనీవే మొగం!
మెల్ల మెల్ల చిరునవ్వవే! ఆ పెదవి విరిచినట్లు సగం!
పులుపుపై మనసు పోయెనా? నీతలపు తలపవేమో మది!
అలసటైతే కూచోరాదే? ఆ లేచి తేవనట్లు - ఎది!
ఒప్పుకోను మగపిల్లాడైతే! ఊరుకుందువేమే సరిసరి!
ఎప్పుడెప్పుడని కోడలికోసం ఎదురుచూస్తినమ్మా మరిమరి!

రామయ్య

చంద్రావికి నెలదప్పిందా యేమిటి? (నవ్వుతూ)

సీతమ్మ

చెపుదా మనుకున్నాను మీతో.

రామయ్య

ఆ భగవంతుడి దయంతా! అల్లుడు కూడా క్షేమంగా వస్తే సంవత్సరాదికి!

సీతమ్మ

రాకేం జేస్తాడూ! అమ్మాయికూడా ఏదో కులాసాగా తిరుగుతూంది గావి. అ_స్తమానం అతగాడి ధ్యాపే! పరధ్యానం అదీవి!

* * *

[గంగిరెద్దు సన్నాయి వాయిద్యం లాంటిది - దూరాన]

నీరుచల్లిన ముంగిట్లో - పన్నీరు చల్లిన వాకిట్లో -
దారిపొడుగునా ముగ్గుల్లు! ముత్యాలు పోసినా ముగ్గుల్లు! ఆ
దారిపొడుగునా సొరుగా ముత్యాల ముగ్గులా గొబ్బిళ్లు! ర
త్నాల ముగ్గులా గొబ్బిళ్లా!

నారుపోసిన ముంగిట్లో - గన్నేరు పూచిన వాకిట్లో -
బారుబారులు బంతుల్లు - ఆ చేరులయి చేమంతుల్లు! బం
గారురేకుల బంతుల్లో చేమంతుల్లోపల గొబ్బిళ్లు!

నీరుచల్లిన ముంగిట్లో - పన్నీరు చల్లిన వాకిట్లో -
నారుపోసిన ముంగిట్లో - గన్నేరు పూచిన వాకిట్లో -
జారు జడలా కన్నెల్లూ - ఒయ్యారి నడలా కన్నెల్లూ - ఒ
య్యారి నడలా జారుజడలా కన్నె లుంచినా గొబ్బిళ్లా!

లక్ష్మి

లేచేరర్రా పిల్లలూ!

పిల్లలు

ఆఁ!

పార్వతి

గంగిరెద్దు!వాళ్ళని చూశారా?

పిల్లలు

ఓ!

లక్ష్మి

బంతిపూలు పెట్టారా? ప్రదక్షిణం చేశారా?

పిల్లలు

ఓ! పక్కింటికి పాములా డొచ్చాడు. వాడికోసం చూస్తున్నాం. అడుగో వస్తున్నాడు....అమ్మ బాబోయ్! అరు గెక్కి నిలబడదాం.

[పాట వాద్యం దగ్గరగా వస్తుంది ...తరవాత పాట]

ఏ పుట్టా దాగేవు? ఎంత పిలిచినా రావు -
నాగన్నా! ఓ నాగన్నా!

ఈ బుట్ట నీ కోసం అల్లే నన్నా!
ఈ తేనె ఈ పాలు నీకే నన్నా!

కనుమూసే ఉడతల్ని పనిబట్టి కాపాడే
గన్నేరు పొదకాడే ఉన్నావా నాగన్నా?

వెండి తీగలాగ, వెన్నెల రేకలాగ
వెలగపూ వాకలా రావన్నా ఓ నాగన్నా!

సీతమ్మ

వాడి కేదన్నా. డబ్బో బియ్యమో ఇచ్చి పంపండర్రా!

పిల్లలు

నే విస్తా.... నే విస్తా....

★★★★★★★★★★★★★★★★★★★★★★★★★★★★★★★★★★★★★★★★

లక్ష్మి

ఇద్దరూ ఇవ్వండి: .... సుబ్బమ్మత్త ఈ పాట వింటే బాగుండును.

సీతమ్మ

సుబ్బమ్మకి రానిపాటలు లేవు. మార్పుల పాటలు, దంపుళ్ళ పాటలుకూడా వస్తాయి. ఈ పెద్దపండుగలో సుబ్బమ్మకి గిరాకీ ఎక్కువ. ఇంటింటికీ వెళ్ళి, పాటలు పాడుతూ, తిరుగుతూ ఉంటుంది.

[లోపలనుంచి జంత్రుళ్ళ పాట వినబడుతుంది]

ఓ ఎలకా! చిట్టెలకా!
ఊరికే చూస్తా వెందుకు?
ఉలికులికి పడతా వెందుకు?

వరిగింజకోసం మావాడు -
వరిచేను కెళ్ళాడు మావాడు!
వలలోను సిక్కాడా - వడిసెలకు దక్కాడా -
మావాడు రాలేదు!

ఓ లేడి! ఓ లేడీ!
ఊరికే చూస్తా వెందుకు?
ఉరకల్లు వేస్తా వెందుకు?

ఏటి ఒడ్డుకే మావాడు -
నీటికై వెళ్ళాడు మావాడు!

వేటకా డొచ్చాడో - ఈపైన విసిరాడో -
మావాడు రాలేదు!

ఓ పెళ్లికూతుర!
ఊరక చూస్తా వెందుకు?
ఉసురుస్సు రంటా వెందుకు?

ఊరేదో వెళ్లాడు నామగడు -
దూరాన ఉన్నాడు నామగడు!
గోరింకనె చూశాడో - నెలవంకనె చూశాడో -
మావాడు రాలేదు!

సుబ్బమ్మ

ఏం పేరమ్మా! ఇంట్లో ఎవరూ లేరూ? ఏమిటి దంపుళ్లా ఇవీవి?

పేరమ్మ

కొత్త దాన్నెం వచ్చి కొట్లు నిండిపోయాయి. అల్లుడుగా రొత్తున్నారు. పిన్న కోడలుగారికి వేవిళ్ళు. సంవత్సరాది వండు గొస్తుంది. మరి, దంపుళ్ళూ యిసురుళ్ళూ లేకపోతే యెట్లా?

[సుబ్బమ్మ లోపలికి వెళుతూ]

ఊరేదో వెళ్ళాడు నీ మొగుడూ!
దూరాన ఉన్నాడు నీ మొగుడూ!

[అలా పాడు తూన్నట్లు అంటూ వెడుతుంది]

సుబ్బమ్మ

ఏం లక్ష్మీ! మీ ఆయన వస్తున్నాట్ట కాదూ!

లక్ష్మి

అవును సుబ్బమ్మత్తా! ఈవేళో రేపో రావాలి. టెలిగ్రాం కోసం చూస్తున్నాం.

సుబ్బమ్మ

తండ్రికోసం పిల్ల లేం బెంగ పెట్టుకున్నారో గాని. నువ్వు మాత్రం సగం చిక్కిపోయావు. వస్తున్నాడుగా! మళ్ళీ వర్షాకాలం వచ్చేసరికి, నువ్వుకూడా పీ కొత్తమరదల్లా ఉంటావు - వర్షాకాలంలో గోదావరిలా - విందుగా!

లక్ష్మి

చాల్లెండి! నాకు పీ ళ్లిద్దరూ -

సీతమ్మ

లక్ష్మీ! అల్లు డొస్తున్నాట్ట! టెలిగ్రాం వచ్చింది.

[అందరూ బైటికి వస్తారు - "ఎప్పుడు", "ఏ రైలుమీద" అంటూ]

కోటయ్య

ఇప్పుడే నమ్మా! నే పవారీబండీ తీసుకెడుతున్నా రైలుకి.

పిల్లలు

మేమూ వస్తాం. చిన్నమామయ్యా! నువ్వూ రా!

లక్ష్మి

అదేమిట్రా! ఆ కుళ్ళుబట్టలూ మీరూ! ఆ కొత్తబట్టలు వేసుకోండి! తాతయ్య కుట్టించినవి.

[పిల్లలు వద్దు వద్దు అని దూరంగా పారిపోతారు]

సుబ్బమ్మ

అల్లుడుగారొచ్చిందాకా నేనూ ఉండి చూసివోతా. సీమనుంచి వచ్చాక ఎలా ఉంటాడో!

లక్ష్మి

లోపలికి రా సుబ్బమ్మత్తా! పిల్ల ఏడుస్తోంది. ఇక్కడ కూచుందాం.

సుబ్బమ్మ

అవును. మొగుడొచ్చేవరికి కోపంగా పెక్కుగా ఉండాలి. చాలా రోజు లయింది కాదూ!

లక్ష్మి

ఇప్పుడే పడుకో బెట్టాను చంటిదాన్ని. అప్పుడే లేచింది. చూడత్తా దానివేషం! ఎప్పుడూ పక్కనే పాడుతూ కూచోవాలి - వాళ్ళ నాన్న పోలిక!

నవ్వంటే జాబిల్లి - పువ్వంటే మల్లి!
నవ్వేటి పువ్వంటే నా చిట్టి తల్లి!
దొంగా కళ్ళల్లో తొగల రేకుల్లో
తుమ్మెదలు మెదలు మళ్ళీ మళ్ళీ!

చిలిపి కళ్లమీద చెక్కిళ్లమీద
ముంజేతి కాటుకలు ఎవరు పూసేరో!
మళీ మళ్లీ మళ్లీ మళ్లీ నా చిట్టి తల్లీ!

కాకమ్మ మేకమ్మ కథ జెప్పినాను....ఊకొట్టె తాను!
రాకాసి దోబూచి రాకండా చూసి, జో కొట్టినాను!
ఆవంత ఆలాగు అరిగొచ్చే సరికి
దొంగకళ్లల్లోను తుమ్మెదలు మెదలు!
మళీ మళ్లీ మళ్లీ నా చిట్టి తల్లీ!

పువులూ కాయలు అల్లి, చిలకల్లు అల్లి,
సవరించి పానుపున ఆ పాలివెల్లి,
వాళ్లమ్మ ఆలాగు వెళ్లొచ్చేసరికి
కళ్ల చెక్కిళ్లా కాటుకలు పాకె!
మళ్లీ మళ్లీ మళ్లీ నా చిట్టి తల్లీ!

మీ అన్న కళ్లేమొ నీలాలపైని!
నీ దొంగకళ్లేమొ దూలాలపైవి!
నీ నాన్న కళ్లేమొ బాలల్లపైని!
మళ్లీ మళ్లీ మళ్లీ నా చిట్టి తల్లీ!

[బండి ఆగిన చప్పుడు. పిల్లలు లోపలికొస్తూ - "నాన్నొచ్చాడు - మామయ్యొచ్చాడు" అన్న కేకలు]

రామయ్య

మామను దింపరా కోటయ్యా!....ఏమోయ్! బాగున్నావా? కులాసాగా ఉన్నావా?

వేంకటేశ్వరరావు

ఆ! విశేషమంటా....ఏం అత్తగారూ! అందరూ బాగున్నారా?

సీతమ్మ

ఉండవోయ్! దిష్టి తియ్యనీ!

వేంకటేశ్వరరావు

ఆ! నా కెందు కండీ?

సీతమ్మ

ఇదిగో - మీ చిన్నబావ పెళ్ళాం....ఒరే! మీ రిద్దరూ బావకి దణ్ణం పెట్టండి!

వేంకటేశ్వరరావు

దణ్ణం పెడితే, నా కేమనాలో తెలీదండీ అత్తగారూ! త్వరలోనే మా అబ్బాయిగాడికోసం ఒక ఆడపిల్లని! కనమన్నా?

పిల్లవాడు

నాన్నా! నీ కోసం దసరాబాణం, నక్కీటోపీ, డబడబ బండీ, అన్నీ కొమంటా.

వేంకటేశ్వరరావు

అవి నా కెందుకురా? మీ పినమామయ్యకు ఇయ్యి. అంటానికి పిల్ల నిస్తాడు....ఆ! లక్ష్మేదీ?

సీతమ్మ

అలిగి కూచుంది లోపల.

వేంకటేశ్వరరావు

ఓ! నేనే వెడతాను లోపలికి....[వెడుతూ]....హాలో! గుడ్ మార్నింగ్ సుబ్బమ్మగారూ!

సుబ్బమ్మ

అదేమిటోయ్! నేను సీమ దొరసాని ననుకున్నావా? నువ్వొచ్చేసరికి మీ ఆవిడ ఏం పాట పాడుతూందో తెలుసా? "నీ దొంగ కళ్ళేమొ వీలాలపైని - మీ నాన్న కళ్ళేమొ బాలికలపైని" అని.

[అందరూ నవ్వుతారు]

వేంకటేశ్వరరావు

అన్నివ్వండి - ఇష్టమొచ్చిన మాటలు! స్థానబలం మరి! [అందరూ నవ్వుతారు]....ఓ! ఏమిటీ సున్నాలూ తోరణాలూను? వేనొచ్చాననా? ఈ వేళ సంవత్సరాది కాదూ? సరిగ్గా వచ్చాను. అబ్బా! ఇలా మూసుకున్నారేం కిటికీలూ తలుపులూ? తెరవండి! తెరవండి!

తెరవండీ తలుపులు! వీథితలుపులు!
పురాణ మీ దివాణమూ బూజు పట్టకుండా!
వినరమ్మా పిలుపులు! మేలు కొలుపులు!
ప్రశాంత మీ ప్రభాతం పరుగెత్తి పోకుండా!

బూజు దుమ్ము ధూళీ మూసెను తిమిరాళీ!
మూసె ఈ హవేళీ!

ఊర్చెను సరికొత్త కొత్త వార్త లెవో గాలి!
తీర్చెను ద్వారముల స్వర్ణతోరణముల హేళి!
బిరాన తెరవరేం
పురాణ మీ దివాణం చెడి బూజుపట్టకుండా!

అదిగదిగో తల లూపుచు ఎదట మావి చిగుళ్లు!
ఎఱ్ఱ కోర్కె చిగుళ్లు!
ఊరక పులకించె నిదే ఒగరువేప ఒళ్లు!

రగులు వలపు జల్లు!
మరలిరావు మనయింటికి పీతుకారు దిగుళ్లు!
చీకటి రాత్రుళ్లు!

గుమ్మము ముంగిట కోయని కోయిల అర్చె!
కోయిలకన్నా మున్నే గున్నమావి ఊర్చె!
మావికన్న మున్నె మలయమారుతమ్ము వీచె!
మలయానిలుకన్న మున్నె మల్లెపొదలు లేచె!

# గౌతమి

[గోదావరీ తీరాననే ఒక గ్రామం. ఉదయం రేవు దగ్గర. సాధారణంగా ఏ పల్లెలో నైనా ప్రొద్దుటనే వినబడే ధ్వనులు విన బడతాయి. గోదావరి గలగలలు, కోడి కూతా, అంభారవమూ, గంగిరెద్దువాని సన్నాయి వాద్యమూ, పొలంనుంచి దూరాన వచ్చే పాలికేక వంటివీ, నీళ్ళలో బిందెలు ముంచునప్పటి చప్పుడూ, స్నానం చేస్తూ నీటిలో మునుగుచున్నప్పటి ధ్వనీ కూడా వినబడ తాయి.]

హరిశాస్త్రి

దేవి! శంభో ర్జటాజూట నివాసిని! శివప్రియే!
లోకరక్షణ కార్యార్థ ముద్భూతాయై నమోస్తుతే
ఏకైనేవ స్వరూపేణ భీమనాథస్య సన్నిధౌ
సదా సన్నిహితా స్యత్ర గోదావరి నమోస్తుతే!

సన్నాసి

సాత్తుల్లుగారికి సలీ లేదు, నొతూ నేదు. తెల్లారకుండానే గోదార్లో మునక లేత్తారు.

సుబ్బన్న

ఏంరోయ్ సన్నాసీ! అర్ని సూపి నువ్వూ దిగుతున్నా వేంటిరా?

సన్నాసి

మనం దిగుతే అడంగుదాకా వొకశే దిగుడు. మరి నెగడం ఉండదు.

వెంకన్నతాత

అది మరీ వయం ఇరగదై పోతావ్ యెదవకానా! సన్నాసీ... వరవా లేదురా ఒరేయ్! అలాగే మంతరాలు నదువుతూ దిగేవ్.

సుబ్బన్న

యేడిశాడు! ఆ పీనుక్కి నోరు తిరగొద్దూ?

హరిశాస్త్రి

ఏఁవిరా సన్నాసీ! అక్కడేనట్రా నువ్వు ముఖం కడగడఁ వున్నూ, ఉమ్మెయ్యడఁవున్నూ?

సన్నాసి

త ప్పేనండి బాబయ్యా, తప్పే నండి.

వెంకన్నతాత

త ప్పంటే సాలదు. దవడలు వాయించుకో!

[స్త్రీ కంఠాలు పాడుతున్న నీలాటిరేవుపాట దూరంనుంచి స్పష్టాస్పష్టంగా వినబడుతుంది]

సన్నాసి

కామయ్యగారి కోడలు మంచిరంగుగా తయా రయిందే!

వెంకన్నతాత

అద్గో, కుక్కబుద్ది. నోర్మూయ్ యెదవకానా. యెప్పుడూ నీలాటిరేవుకాడే బైటాయిత్తాడీ పోకిరి. యెవళ్ళో నవ్వుగా వాళ్ల సుద్ది సేసిందాకా.

[నీలాటిరేవు పాట దగ్గరకు వస్తుంది]

ఉరకలు వేసీ పరుగులు తీసీ
చెంగూ చెంగున పొంగుతు వచ్చే గోదారి!

వంతెనకాడా పంతా లాడక
వంతూ లేసుకు వంకరదారి పోదారి!

కడియా లందెలు గాజుల సందడి
కడవల నీళ్లా గలగల గలగల ఒయ్యారి!

నీటూ నేయకు గోటూ నేయకు
పాటీరేవూ ఏటా వాలే సింగారి!

హరిశాస్త్రి

ఏమి టా విసురూ! మీద నీళ్లు పడతాయి.

[ఆడవాళ్ళ నవ్వులు]

ఒక ఆడగొంతు

సూరన్న కాపర్రోయ్!

సూరన్న

ఏఁవి టర్రా అదీ. పిన్నా పెద్దా లేకుండా! శాస్త్రుల్లుగారిని చూసుకో వొద్దూ! శాస్త్రుల్లుగారూ, దండాలు.

హరిశాస్త్రి

[ఆశీర్వదించును] పుత్రపౌత్రాభి వృద్ధి రస్తు! ధనకనక వస్తు వాహన సమృద్ధి రస్తు! ఏం సూరన్న కాపూ! ఉదయాన్నే రేవు దగ్గర కొచ్చావ్?

సూరన్న

మా అమ్మాయీ, అల్లుడూ రావా లండీ కోటిపల్లి పడవమీద. పెద్దబ్బాయి వెళ్ళాడు తీసుకు రాడానికి.

వెంకమ్మ

ఏం సూరయ్యన్నా! లక్షిందేవి పురిటి కొస్తోందా ఏవిటి?

సూరన్న

మరే వెంకమ్మక్కయ్య గారూ!

హరిశాస్త్రి

సూరన్న కావు కేం? గోదావరితల్లి చల్లగా చూస్తున్నంత కాలం పాడీ పంటా, సిరీ సంపదా, పిల్లా మేకా—గుణాన్నిబట్టే అన్నీనీ.

సూరన్న

అంతా తమ చలవే శాస్త్రుల్లుగారూ!

[దూరాన్నుంచి పడవపాట దగ్గరగా వస్తూ]

సన్నాసి

అది గదిగో వొచ్చేత్తుంది రాదారీ పడవ!

[పడవ పాట]

గోదారీ జోతలో!
పాదాల జోతలో!
మాతల్లి గోదారీ మాలచ్మి జోతలో!



పడమటింటి కోనబుట్టి, సల్లాలా అడుగుబెట్టి,
పాపికొండ లోయ గొట్టి, బద్రాద్రి దాపులో,
పట్టీసం సుట్ట బెట్టి, కోనసీమ తోపులో,
పాయపాయ లైనావా! పాడిపంట లిచ్చావా-
పైడిపంట లిచ్చావా! గోదారీ జోతలో....
పాలపిట్ట, గువ్వజంట, పావురాయి కూత లంట!
ఆవలొడ్డున ఈవలొడ్డున తెల్లరెల్లుపూత లంట!
అద్దరినీ, ఇద్దరినీ పైరుపేల కోత లంట!
సూసుకుంట మెచ్చావా, రాసుకుంట వొచ్చావా
॥గోదారీ॥

సరంగుల గొంతుకులు

"ఒరే! దమాను దింపరా"
"గెడెయ్! గెడెయ్!"
"దరికి పట్టు దరికి పట్టు!"
"పెక్క సరిగ్గా యెయ్యరా సరిగ్గా ఎయ్."

సూరన్న

వొచ్చావా అమ్మా! పిల్లాణ్ణి ఇలా గియ్యి.

హరిశాస్త్రి

ముందు అల్లుడుగార్ని పలకరించవోయ్ సూరయ్య కాపూ!

వెంకమ్మ

తరవాత కోపాలూ తాపాలూ వస్తే కొండెక్కి కూచుంటారు. పట్నవాసం అల్లుళ్ళకి పట్టింపు లెక్కువ.

అల్లుడు

పాతబడిపోయాం. ఇంక మా పట్టింపు లేం చెల్లుతాయి లెండి.

వెంకమ్మ

ఓహోహో! లక్షిందేవి కాబోసు. "మొగుడి చాటున దాగి, ముద్దూలగుమ్మా" (పాటలాగ) రా ఇవతలికి రా!

లక్ష్మీదేవి

బా గున్నారా వెంకమ్మత్తగారూ!

వెంకమ్మ

బా గుండ కేం తల్లీ! మహాలక్ష్మిలాగ నువ్వు కనబడుతుంటే. "వీరంత వెళ్ళిన్నా ఇనక సన్నంపు. ఏరు దా టొచ్చింది ఎవ రాడ బడుచు" అనీ, మహారాణివి నీ కేం తల్లీ! [అందరూ నవ్వులు] "గోదారి కద్దకీ ఇద్దరీ పంట" అన్నట్లు ఈ చంక నో బిడ్డ ఆ చంక నో బిడ్డ మా లక్షిందేవికి.

ఒక ఆడగొంతు

పాటల వెంకమ్మగారి నోటికి తాళం ఉండదు. [అందరూ నవ్వుతారు.]

సూరన్న

సరే లెండి! ఇంక కదలండి. చూస్తావేంరా సన్నాసీ! పెట్టి బేడా నెత్తి నెత్తుకో. ఊఁ. నడవం డమ్మా!

... ... ...

[గంగిరెద్దు వాడి సన్నాయి]

గంగిరెద్దువాడు

డూడూ డూడూ బసవన్నా.

సూరన్న

ఒరేయ్ పక్కకి తప్పుకో ; అమ్మాయి లోపలికి వెడుతుంది.

గంగిరెద్దువాడు

అమ్మాయి గారూ అల్లుడు గారూ వచ్చారు. ఇయ్యాల బస వన్న బియ్యంతోనూ బిచ్చంతోనూ పోదండి.

బసవన్నా ; అమ్మాయిగారికి దణ్ణంపెట్టూ.

డూడూ డూడూ

అల్లుడిగారికి దణ్ణంపెట్టూ

డూడూ డూడూ

సూరన్న

అబ్బాయ్ ; వీడి కో సేరు బియ్యం. పాతపంచా, చీరా ఇచ్చి పంపించు. ఇదిగో, అమ్మాయీ అల్లుడూ మనమడూ వచ్చారు.

సీతమ్మ

అమ్మా వొచ్చావా. ప్రాణా లన్నీ నీమీదే పెట్టుకున్నాను రా త్రంతా. గోదారి పూటుగా వచ్చింది. రావయ్యా అల్లుడుగారూ ;

మనవడు

అమ్మ మ్మోయ్. నాన్న నాకూ అమ్మకీ పడవమీద ఫొటో తీశారు.

సీతమ్మ

అబ్బో అబ్బో ఇలా రావోయ్. నన్నెత్తుకోనీ. ఏఁవయ్యా. అస్తమానూ అలాగ ఫొటోలు తియ్యకూడదట. కళ తగ్గిపోతుందట. రండి దిష్టి తీసి పారేస్తాను.

అల్లుడు

సరే కానియ్యండి. మీ అమ్మాయికీ మనవడికీ తియ్యండి. చాలు. వాళ్ళకి మిమ్మల్ని చూడడంతోనే ఎక్కడలేనికళా వొస్తూంది.

సూరన్న

ఒరే అబ్బాయి! నువ్వు ముందు పొలం వెళ్ళు. కూలీలు కని పెట్టు కుంటారు.

అబ్బాయి

ఏం బావా. నువ్వూ వస్తావా ఏఁవిటి?

అల్లుడు

నన్నొదిలేద్దూ. నన్నెందుకు చంపుతావు, ఆ వాడీ బందలో!

అబ్బాయి

పొలంలోకి తారురోడ్డు వేయిస్తాలే బావా, నీ కోసం. నే నెడుతున్నాను నాన్నా! ఒరే సన్నాసీ, నువ్వు ముందు పరుగెయ్.

... [అర చిటికె విరామం] ...

★★★★★★★★★★★★★★★★★★★★★★★★★★★★★★★★★★★★★★★★

సన్యాసి

ఏయ్ కూలీలూ కదలండి. శివకా వొత్తున్నాడు. ఏయ్ పిల్లా! దిక్కులు సూడకు. కాలు జారి గప్పున వా వొళ్ళో వడగలవ్!

పిల్ల

పొల్లే వయ్యా! సన్యాసయ్యా! సిగ్గూ సివరా ఉండొద్దా?

మరో స్త్రీ

సన్యాసయ్యాకా, మరి సిగ్గేంది?

పిల్ల

సన్యాసి మాఁవా! ఒక పుగాకు పా యిలా పడెయ్యవయ్యా!

సన్యాసి

పొగా కిత్తే మ వ్వే ఁవిత్తావ్?

ఒక మగ కూలి

ఏడిసిన ట్టున్నాయ్ పరసాలు! యెవకా లొత్తున్నాడు శివకావు. పదవం డల్లా, పదవండి.

సన్యాసి

రండి, అడు గెయ్యండి.

[పొలం పాట]

రండి రా రండి కనరండి కమలారా! రైతుజనములారా!
మోతుబరులారా!

వ. రండి వడవండి బూదేవి సల్లనితల్లి
రైతుజనులారా। మోతుబరులారా॥

గోదారి గంగమ్మ గొప్ప ఇల్లాలు
ఆ దేవి సల వుంటె అదె మాకు సాలు।
విండు చూలాలల్లె పండి వారిగే నేలు।
దండీగా రాలు బంగారు ధాన్యాలు
గరిశెల్లు పండగా గాదుల్లు నిండ
॥రండి రా రండి॥

పండేటి గరిశల్లు పదివేలు తెచ్చు – పెదకాపు కిచ్చు
మాబాబు కొరిగితే మాకేమి వొచ్చు? –
మా బతుకు లొచ్చు।

ఊఁ అంటే ఆఁ అంటే ఉప్పొడకోక – ఉల్లిపొర రైక।
ఊఁ అంటే నా అంటే కోపతాపాలు – కోర మీసాలు
అయ్యగారికి లేవు వావివరసాలు
రొయ్యకైనా లేవు అయ్య మీసాలు ॥రండి రారండి॥

... [పాట దూరాన కరగిపోతుంది] ...

హరిశాస్త్రి

సూరన్న కాపూ. సూరన్న కాపూ.

సూరన్న

అయ్యో. శాస్త్రుల్లుగారూ। రండి లోపలికి రండి।

హరిశాస్త్రి

ఇదిగో అల్లుడుగారితో కూచుని మంతనా లాడుకున్నావూ? రాత్రి పురాణానికి అల్లుణ్ణికూడా పిలవడానికి వచ్చాను. ఏదో మా ధోరణికూడా కాస్త వింటా డని.

అల్లుడు

నా కేం తెలుస్తాయండీ పురాణాలు!

హరిశాస్త్రి

తెలియడాని కేం ఉం దయ్యా. వచ్చి విను. పురాణం చెపితే మీ సినిమాలాగ కళ్ళకి కట్టిన ట్టుండాలి. ఇప్పుడు భీమేశ్వర పురాణం అని - చాలా గొప్ప గ్రంథం- అది కాలక్షేపం చేస్తున్నాం. శ్రీనాథ మహాకవి స్కాందంలోనుంచి ఆంధ్రంలో మహా పసందుగా వ్రాశారు. అంతా గోదావరీ మాహాత్మ్యమే. కవిత్వంకూడా భాద్ర పదంలో గోదావరిలా నడుస్తుంది. తప్పకుండా రా నాయనా! అదిగో అమ్మాయి నీకు కాఫీ ఫలహారం తెస్తోంది. నే వెడతా.

అల్లుడు

అదేఁవిటి? మరి మన శాస్త్రుల్లుగారికి కూడా తీసుకురా!

హరిశాస్త్రి

హ హ్హ హ్హ! మంచి సరసంగా చెప్పావు. అంతవరకు ఇంకా నేను చదువుకో లేదు నాయనా. అల్లుడు మహా చురుకైనవాడు మారన్న కాపూ!

లక్ష్మీదేవి

శాస్త్రుల్లుగారు మన పట్నవాసపు బ్రాహ్మల్లాగ కాదు. మన ఫలహారాలు తినరు.

సూరన్న

పట్నవాసాలు మరిగి పల్లెటూళ్ళ మర్యాదలు బొత్తిగా మర్చిపోయారయ్యా మీలాంటివాళ్ళు. పురాణాలంటే మాకేం తెలుస్తయ్యంటారు. పొలం వెళ్ళమంటే బాడీ బిందా అంటారు.

అల్లుడు

అలా చీవాట్లు పెట్టకండి. రాత్రి పురాణానికి వస్తా. ఇప్పుడు పొలానికి బయలుదేరుతున్నా. బావ రమ్మన్నాడు కూడా పొద్దున్న.

సూరన్న

సన్నాసీ! అల్లుడుగారిని పొలం తీసుకెళ్ళరా!

సన్నాసి

పొటిగరాపు పెట్టికూడా వస్తరండి బాబూ!

అల్లుడు

సరే, తెస్తున్నాలే. నడు.

... ... ...

అబ్బాయి

ఇదుగో బావా, రా సన్నాసీ వొచ్చావే!

అల్లుడు

ఎంతసే పని ఇంట్లో కూచుంటాను?

చిన్నమ్మి

అల్లుడుగో రేంటి బాబయ్యా?

అబ్బాయి

అవుమలే - జాం పొద్దుందగానే వ న్నాగ్గేశా రేఁవిటి! వదండి.

చిన్నమ్మి

ఏటి బాబూ, పొద్దు కూ కొస్తుంటేను.

సన్నాసి

ఇక ఫోటిగరాపు తియ్యండి బాబయ్యా! ఒలే పిన్నమ్మీ. పక్క నిలబడే. పిన్నమ్మికి పినిమాల్లో ఎయ్యా లనుంది బాబయ్యా!

చిన్నమ్మి

నీ పీజి మ్మడ - సచ్చినోడా!

అబ్బాయి

ఇయ్యాల కింక పని ఎగేపినట్టేనా ఏంటి? మ వ్వొచ్చి మా మంచిపని చేశావ్ బావా!

అల్లుడు

ఉండండి, లేవకు - నీ ఫొటోకూడా తియ్యనీ బావా! ఒక్క నిముషం. ఆ. కొంచెం నవ్వు. [బ్లర్...ర్...క్లిక్]

అబ్బాయి

రేపు పెందరాళే రండి....రా బావా, పోదాం.

... ... ...

[తందానో తాన తందనానో అని ఆలాపనం, తప్పెట్లూ కొండ లైనవి వినబడతాయి.]

అల్లుడు

ఏఁవి టది? బుర్ర కథలా ఉందే. ఆ దారినే పోదాం.

అబ్బాయి

మరే. రామ కోవిలకాడ. రా. వెడుతూ కాస్త ఆగి విని పోదాం.

[బుర్ర కథ]

తాన తాన తందానా - తాన తందనాన
ఆంధ్రదేశమున అయ్యలందరూ దాన కర్ణులండీ
ఆంధ్రదేశమున అమ్మలందరూ అన్నపూర్ణ లండీ
అది గది గదిగో తెలుగుతల్లి మనపాలి కల్పవల్లి
అది గది గదిగో తెలుగుతల్లి అందాల పాలవెల్లి.
దక్షిణదేశపు ధాన్యలక్ష్మి మాతల్లి తెలుగుతల్లీ
అక్షయసంపద కాలవాల మీ అమ్మ తెలుగుతల్లీ
ఆ - తెలుగుతల్లి మెడ తారహారమే గౌతమి గోదారి
గోదావరి ఒడిలోన కులికే బిడ కోనసీమ.
ఏడుపాయలా గోదావరికీ - పీడు కోనసీమ
పాడిపంటలా పైడిరాసులా - నాడు కోనసీమ

కొబ్బరితోటల దారులూ....సై
పోకతోపులా బారులూ....సై
పచ్చపచ్చనీ పైరులూ....సై
పనసా అరటీ తీరులూ....సై
దేవలోకపూ పూవుతోటలకు ఈడు కోనసీమ
జోడు కోనసీమ
అది గది గదిగో తెలుగుతల్లి మనపాలి కల్పవల్లి
అది గది గదిగో తెలుగుతల్లి అందాల పాలవెల్లి
దేశదేశాలకూ రాణిరా....సై
కళల కెల్ల రాజధానిరా....సై
తెలుగుభాష దివ్యవాణిరా....సై
తెలుగువాడె అభిమానిరా.
... [క్రమంగా దూరం అవుతుంది] ...

కరణం

సూరన్న కాపూ! సూరన్న కాపూ!

సూరన్న

ఏంవిటి కరణంగారూ! దయచెయ్యండి. అమ్మాయిపెళ్ళి మా వైభవంగా చేస్తున్నారు.

కరణం

కాపు లందరూ బాగుంటేనే కరణం వైభవం.

సూరన్న

కరణంగారి చల వుంటేనే కాపులు బావుంటారు. అయితే, పెళ్ళిపెద్దలు తమరే దయచేశారేవిటిలా?

కరణం

పట్నం నుంచి అమ్మాయి లొచ్చారు - ఇప్పుడు భరతనాట్యం వుంది. మీ అల్లు డొచ్చా డని విన్నాను. మరి స్వయంగా వొచ్చి పిలవకపోతే బా వుంటుందా? మన గ్రామంమీదే అలుగుతాడు.

సూరన్న

(హా (హా.బాగా అన్నారు. అరుగో. మాటలోనే వచ్చారు అల్లుడూ అబ్బాయీని. ఇదుగో నయ్యా. కరణంగా రింట్లో భరత నాట్యం ఉందట. నిన్ను పిలవడానికి స్వయంగా వచ్చారు. ఇలాగే వెళ్ళొద్దాం. పదండి.

అల్లుడు

సరే నండి.

... ... ...

[భరతనాట్యము]

సుందరా! పురందరా! శచీమానసమందిరా! ఏ
మందురా! మదిలోన వలపులు మరిగి
తొందర లాయెరా!
అందె రవళులు విందువా! నా
అందచందాల్ కందువా? ఓ సుందరా....
మందపవనుడు తరలెరా,
మందాకినీ నది తెరలెరా! మన
నందనోద్యానమ్ములో మందారమధువులు ఉరలెరా! ఏ
మందురా, మదిలోని వలపులు మరిగి
తొందర లాయెరా! ఓ సుందరా....

ఓరచూపులు తరలు నెవ్వనికై !
దోర పెదవులు విరియు నెవ్వనికై !
జాఱు పయ్యెదలోని ఎదలో
ఊరు రాగము లెవనికై ?          ఓ సుందరా....

సూరన్న

శానా బా వుంది. అమ్మాయిలు శానా చురుకైనవాళ్ళు.

అల్లుడు

వీళ్ళద్దర్నీ నే నెరుగుదు నండీ. అక్కా చెల్లెళ్ళు. సినీమాల్లో వేస్తూంటారు. మధురానగరిలో అనేపాట చాలా బాగా అభినయిస్తారు.

సూరన్న

సెలవిప్పించండి కరణంగారూ।

కరణం

మంచిది.

... [సన్నాయి] ...

సూరన్న

ఇదుగో- చూడు. కాళ్ళు కడుక్కోడానికి నీళ్ళు తే. భోజనాకి లేస్తాం.

అల్లుడు

నా కిప్పు డప్పుడే ఆకలిగా లేదు. మీ అమ్మా యేది?

సీతమ్మ

ఆరుబయట పిల్లాడికి అన్నం పెడుతోంది.

[బువ్వపాట]

కిలకిల నగవుల కులకుల నడకల
జిలిబిలి పలుకుల చిరుచిరు సొగసుల
చిన్నారి చిల కేదే పాపా! పొన్నారి మొల కేదే!

చందమామ కొద్దూ గానీ, పందెమేసి తిందూ గాని
ముందు నీకే విందుగాని ముద్దులయ్యా!
ఇంద ఇంద నీబువ్వ పాపా! ఎందు కయ్య ఈ రవ్వ!

నీలాల మేడమీద తేలేటి జాబిల్లి
పాల పానుపుపయి పవ్వళించేనే
నిదురకు వేళాయె పాపా! కుదురుగ తినవాయె!

చందమామ రావే జాబిల్లి రావే
ఇంద ఇంద ఈ బువ్వ నువ్వే తినిపోవే
పాప కింత వొద్దు లేవే! పోవే! రేపు మళ్లి తిరిగి రావే!

అల్లుడు

అబ్బో! మా ఊళ్ళో ఎప్పుడూ కంఠంవే విప్పేదానివి కావు. చాలా బాగా పాడుతున్నావే. పుట్టిల్లు చూడగానే పుట్టుకొచ్చిందేవిటీ పాట?

లక్ష్మీదేవి

ఆ. అక్కడ పనులతోటే తీరిపోతుంది. పాటక్కూడా తీరి కెక్కడ?

అల్లుడు

పెళ్ళిచూపులు కొచ్చినప్పుడు ఈలాటి పాట పాడలేదే. "లంబో దర" పాట పాడేవు గాని.

లక్ష్మీదేవి

[నవ్వి] మిమ్మల్ని చూడగానే అది పాడ బుద్ధేసింది.

అల్లుడు

మీ ఇంట్లో ఉన్నా వనా? ఏఁవిటో జోరుగా విసురుతున్నావు. సరే, ఇక్కడే ఉండిపోదాం. మీ వాళ్ళకి అభ్యంతరం లేకపోతే. పనీ ఎగె య్యొచ్చు. మాటా విన రొచ్చు. పాటా పాడొచ్చు. ఏఁవి టలా వెళ్ళిపో తున్నావ్?

లక్ష్మీదేవి

బాబు విద్రపోయాడు.

అల్లుడు

పడుకోబెట్టి రా. గోదావ రొడ్డు కెళదాం.

... ... ...

అల్లుడు

[మానరాగం తీసి పద్యం చదువుతాడు]

కనరో గౌతమి కన్నతల్లి వి
దయా కల్లోలినిన్ తియ్య తీ
యని ఆ వెన్నెల పాల మీగడల
శయ్యన్ పవ్వళించేము మె

ల్లవి రాగాల పదాల లాలనల
 జోలల్ పాడుచున్ చల్ల చ
ల్లవి కేలన్ తన బిడ్డలన్ విదుర
 దోలన్ తూగగా నూపుచున్.

లక్ష్మిదేవి

మీకూ రాగా లొస్తున్నాయే!

అల్లుడు

రావూ మరి నీవు పక్కనుంటే! లక్ష్మీ. ఈ పడవమీద కూచుందాం. చెయ్యి పట్టుకో జారకుండా! ఆ. ఆ. జాగ్రత్త! లక్ష్మీ. ఎంత బా వుందిక్కడ! పుస్తకాల్లో చదివినట్లూ, సినిమాల్లో చూపినట్లూ ఉందిదంతా. పైరు చేలూ, పచ్చని తోటలూ నడమ కిందు గోదావరీ, పైన పండువెన్నెలా సృష్టిలో ఎక్కడా మన కోనసీమలాంటి దేశం లేదు తెలుసా!

[సాకీ]

ఈ ప్రశాంత యామిని - ఈ గౌతమి - ఈ వెన్నెల
ఈ చల్లని దారులలో - ఎవరో - ఎవ రోహో!

లక్ష్మిదేవి

(పాట)

ఆదే జాబిలి.

అల్లుడు

ఇదే నా చెలి!

ఇద్దరూ

నదిని నావ కదలాలి -

లక్ష్మీదేవి

తరుల గుబురులో తారి చేరి
తరంగాల చిరుగాలి.

ఇద్దరూ

నదిని నావ కదలాలి!

అల్లుడు

కనులు కనులలో కరగాలి!

లక్ష్మీదేవి

క్షణము క్షణ మిలా జరగాలి.

ఇద్దరూ

నా మది నీ మదిపై ఒరగాలి
నీవూ, నేనూ, రేయీ హాయీ
ఇటులే నిలవాలి
నదిని పడవ నిలవాలి!

ఈ ప్రశాంత యామిని - ఈ గౌతమి - ఈ వెన్నెల
ఈ చల్లని దారులలో - ఎవరో - ఎవరో హా!

... ... ...

సూరన్న

ఇదిగో! చూడు. నేను గుళ్ళోకి పురాణానికి వెడుతున్నాను. అల్లుడొచ్చాక, భోజనా లయాక అబ్బాయినీ, అతన్నీ పంపించు.

సీతమ్మ

అలాగే.

... ... ...

[పురాణ కాలక్షేపం]

హరిశాస్త్రి

ఆ తరవాత భరద్వాజుడూ, గౌతముడూ మొదలైన మహర్షులు ఏడుగురున్నూ దశారామన్నుంచి కదలి గోదావరీతీరానికి వేంచేసి ఈవిధంగా ఆ దేవిని కీర్తించారు. ఏఁ వని? అమృతోపమానాలైన నీ నీళ్ళతో జంతుకోటిని రక్షిస్తున్నావు నువ్వు. తల్లి వనడాని కేఁవి సంశయం? గోదావరమ్మా! నీవు పృథివి నెల్లనూ రక్షించ పేరంటాలవు!

"గోదావరి గోదావరి
గోదావరి యంచు బల్కు గుణవంతులకున్
గోదావరి తల్లీ సం
పాదింతు గదమ్మ నీవు భవ్యశుభంబుల్"

అని పరమ ఋషులు ఆ తల్లిని చేతులెత్తి ఆహ్వానించారు. ఏవిధంగా ఆహ్వానించారయా?

"విచ్చేయ వమ్మ శ్రీ వృషభవాహన ధర
సామజ కటమ దానాసారధార!

వయనమ్మ గావమ్మ భర్గ జటాటవీ
కుటజ శాఖా శిఖా కోరకంబ!
రా వమ్మ యాదిమ బ్రహ్మదోః పల్లవ
స్థిత కమండలు పుణ్య తీర్థజలమ!
లేవమ్మ విశ్వంభరా వధూటీ కంఠ
తార మౌక్తిక హార దామకంబ!
తెరలతో వీచికలతోడ తరులతోడ,
విమల డిండీర ఖండ తండములతోడ,
మురువు, ఠీవియు, నామోదమును, జవంబు,
వడువు నొప్పంగ గంగమ్మ నడువ వమ్మ!"

అని సప్త మహామునులూ ఆహ్వానించడమున్నూ, గౌతమీ గంగ ఆలకించడమున్నూ, కొండెత్తు కెరటాలతో, మరిగిపోయే మరుగులతో, పట్టరాని వేగంతో మున్యాశ్రమాన్ని చుట్టబెట్టి ముంచె తేపే అద్దరినీ, ఇద్దరినీ-

"ప్రాగ్వంశంబులు స్రుక్స్రువంబులును
యూప స్తంభ పంక్తుల్ హవి
ర్భుగ్వేదీ విలయంబులున్—"

మరిన్నీ—

దేవార్చనా
స్రగ్వాసోఘటికాకమండలు బ్రుసీ సంఘాతమున్

అన్నీ ఒక్కపెట్టున కొట్టుకు పోయాయి - అలాగ వచ్చింది ఆ బ్రహ్మాండ మైన వరద.

[నీటి హోరూ, కొంచెం దూరంగా కలకలం, గోలా, ఆర్తనాదాలూ_దూరాన్నుంచి దగ్గరగా, మరీ దగ్గరగా]

"వరద వరద సూరన్న కాపుగా రోయ్!"

"బాబూ కరణం గారూ, పల్లపు చేమపక్క గండి పడి పోయిం దండి బాబోయ్!" "లెండి లెండి లేవండోయ్." "గోదావరి తాటిచెట్టు నిలువున పొం గొచ్చేస్తోంది బాబోయ్." "పడమటేపువి కొంపలన్నీ మునిగి పోయాయి బాబోయ్!"

హరిశాస్త్రి

ఆ.—ఏఁవిటీ - అలవి గాని ప్రళయం వొచ్చిందే! అంగారు పడకండి. సూరన్న కాపూ, కరణంగారూ, పడవండీ....

సూరన్న

నన్నాపీ! ఆ రేవుకాడ పడవ లెన్నున్నాయో తీయించు—

కరణం

ముందు ఆడవాళ్ళనీ, పిల్లల్నీ మెరక పొలం చేర్చండి.

సూరన్న

ఒరే సుబ్బన్నా! అదుగో ముంచుకు వచ్చేస్తుంటేనూ— ప్రాణాలు దక్కితే చాలు - పెట్టీ బేడా సంగతి తర్వాత చూదొచ్చు.

[హోరు పెద్దదై పోతుంది]

దవ్వు దవ్వుల తరలి రెవరో
రివ్వు రివ్వున కదలి రెవరో
జలప్రళయం జలప్రళయం
మహావిలయం, మహావిలయం

క్రుద్ధ రుద్ర జటాటవీ స
న్నద్ధ గంగా తుంగ భంగా
లెపుడు దుమికినవో భువిపై
ఏల యురికినవో

జలప్రళయం జలప్రళయం
మహావిలయం మహావిలయం

విలయకాలపు మృత్యువా అది
ప్రళయ భైరవ నృత్యమా అది
మహాంకాళీ పటుకరాళీ
చటుల కరవా లోగ్ర ధారా
పటల విద్యుద్వహ్నులా ?

జలప్రళయం జలప్రళయం
మహావిలయం మహావిలయం

ఝఝరియా మంజీర కిన్నెర
చేతులూ చేతులూ కలిపేయ్ !
జెబ్బలూ జెబ్బలూ కలిపేయ్ !



లోతులా విందేయ్!
గౌతమి పొంగి పొర్లింది

జలప్రళయం జలప్రళయం
వరదలూ, వరదల్లో వరదల్లో

మళ్లబడి పరవళ్లవిడి పరు
గుల్లవడి ఉరుముల్లసడి నుర
గల్లు గ్రక్కింది - అదిగో
వుట్లు తొక్కింది - అరరే
గట్లు నెక్కింది!

వరదలూ వరదల్లో వరదలు

మిట్ట పల్లా లేకమై,
మిన్ను లోయలు ఏకమై,
పట్టణా ల్పల్లెలూ దిగబడి,
కట్టలూ కాలువలు తెగబడి,
పిట్టలై మానవులు భయపడి,
చెట్టు కొకరై లోకువై -
అర్ధరాత్రి ఇదేమి ప్రళయం!

జలప్రళయం జలప్రళయం
వరదలై పొంగింది గౌతమి
వరదలూ వరదల్లో వరదలు



తాను కడలికి తరలు తొందర!
కడలి తానై కదలు తొందర!
కడలి ఏదో గౌత మేదో!
ఏక మైనవి ఏడుపాయలు!
సప్తగౌతములా ఇవియే!
సప్త వార్నిధులా?

వరదలూ వరదల్లు వరదలు

గోడలా కూలేని, మరి, పెను
మేడలా రాలేని - అయయో!
గొడ్డుగోదం పాడిపంటా
కొట్టుకుని పోయేని - అరరే
కూలిపోతున్నాయ్ - అయయో
రాలిపోతున్నాయ్!

చెల్లచెదరై పిల్లమేకా
చెదరి పోతున్నాయ్ - అసువులు
బెదరి పోతున్నాయ్
అయ్యయో అని అనే దెవరో
అయ్యయో అన వినే దెవరో
అర్ధరాత్రివి జలప్రళయం
జలప్రళయం!

తల్లి గౌతమి మనసు నొ స్తే
పిల్లలకు గతి యేది తల్లీ?
అమ్మ గౌతమి ఆగ్రహి స్తే
బిడ్డలకు దిక్కేది తల్లీ!

పిల్లలా లోపాల నెంచకు
బిడ్డలా పాపాల నెంచకు
పిల్ల మేకా పొలం పుట్రా
చల్లగా కాపాడు మమ్మా
విన్న నమ్మిన వార మమ్మా

కన్నతల్లీ వృద్ధ గౌతమి!
శాంతి శాంతీ శాంతి గౌతమి!

# వేణుకుంజం

[ప్రకటనతో వీణా గానం. ఇక్కడమాత్రం తెంపు ఉండగూడదు]

కవి

విజమనీ చెప్పింది వేణుకుంజం – ఒట్టు!
విజమనీ చెప్పింది వేణుకుంజం!
ఓనాడు ఏటితో ఊసుపోకా, మనసు
ఊరికే విప్పింది వేణుకుంజం! ॥విజ॥

ఊరు పడమట ఏరు ఉన్నదా?

గొంతులు: ఉన్నది

చేరి మామిడితోట ఉన్నదా?

గొంతులు: ఉన్నది

తోటకూ ఒక పుంతబాటకూ నడుమనే
పాట పాడే వేణుకుంజం!

గొంతులు: ఆఁ! ఆఁ! ॥విజ॥

తలయెత్తి ఇటు అటూ చూస్తుంది!

గొంతులు : చూసి ?

చూపింది మనసులో దాస్తుంది !

గొంతులు : అపుడు ?

వలిగాలి మెల మెల్ల వీస్తుంది !

చలియించి కథ చెప్పి వేస్తుంది !

గొంతులు : ఆఁ ! ఆ ! ॥వెజ॥

మగగొంతు

ఏమిటో - వేణుకుంజం చెప్పిన కథ ఏమిటో ?

కవి

కన్నె పేరంటా లిది. వింటే, కడుపు చెరు వవుతుంది.

ఆడగొంతు

మాకు చెప్పగూడదో ఆ కథ ?

కవి

ఆ వేణుకుంజంలాగ చెప్పగలనో లేనో అని. ఆ సాయం కాలపు గాలీ, ఆ యేరు ఊ కొట్టడం - ఊఁ హూఁ - నే నలాగ చెప్ప లేను. ఆ రోజునమాత్రం కథ ఒకే ఒక వెదురు చెప్పింది. నడుమ నడుమ కథ ఊపులో ఉండబట్టలేక, వెదుళ్ళన్నీ కలిసి పాడేయి - ఆడ వేణువులూ, మగ వేణువులూ. నాడు విన్న కథ నేటిదాకా మనస్సులో ఇముడ్చుకున్నాను. ఆలకించేవా రుంటే -

అత మగ గొంతులు

ఏదీ? ఏదీ? మేం వింటాం - మేం వింటాం.

[చిరుగాలి ఈలలూ, సెలయేళ్ళ గోలలూ, ఏటి గలగలలూ, వానిలోనుంచి ఒక పురుష వేణువు కంఠమూన్నా]

వేణువు

అల్లదిగో - ఆ పూరిల్లే వీరమ్మ యిల్లు. వీరమ్మ తండ్రి వెంకటేశు. తానూ, అయ్యా, ఆ ఇంట్లోనే ఉండేవారు.

ఏరు

వాళ్ళమ్మో?

వేణువు

వీరమ్మ వెలుగు చూడడ మేమిటి - వాళ్ళమ్మ కన్ను మూయ్యడ మేమిటి!

ఏరు

పాపం!

వేణువు

వెయ్యి కళ్ళతో చూస్తూ వెంకటేశు పెంచుకున్నాడు కూతుర్ని. తన పెళ్ళాం ఒక అచ్చర అనీ, అప్పుడెప్పుడో మునీశ్వరుడికి పసి బిడ్డ నిచ్చి వెళ్ళిపోయిందే ఆ దేవతా స్త్రీ - అలాగే ఆమె వెళ్ళిపోయిం దనీ వెంకటేశు నమ్మకం. పిల్ల పెంపకంలో వెంకటేశుకి తోడ

య్యాయి తోటా, తోటలో పిట్టలూ, చేనూ, చేమగట్టులూనూ. అల్లాగే వీరమ్మ పెరిగింది - అల్లారు ముద్దుగా - కార్తికంలో రెల్లు పొదలాగ కలకల లాడుతూ. కులానికి తక్కువేమో కాని, గుణానికీ సోయగానికీ వీరమ్మకు ఈ డెవ్వరు వాడలోనూ ఊరులోనూ?

ఏరు

ఆఁ! ఆఁ! అంత చక్కనిదో వీరమ్మ?

వేణువు

ఏం సొగసో వీరమ్మది!
ఏం సోయగ మీరమ్మది!

కందిరీగ వంటి నడుం!
కదురు లాంటి ఒళ్లు!
మందంగా గోవులాగ
మళ్లదారి నడుస్తుంటె - మలుపుదారి నడుస్తుంటె -
ఏం అందం - ఏం చందం!
ఏం సొగసో వీరమ్మది!

గట్టుకవల అరకదున్ను అయ్యకు బువ్వట్టుకునీ-
పట్టెడు కాటుక కళ్లకు,
పుట్టెడు పువ్వులు సిగకు-
వీర మ్మొడుతుంటే
పైరుచేను చూసి చూసి పరవశమై ఊగేది!
శిరసు వంచుకునేది!

పైరగాలి సరదాగా పడుచుబుగ్గ నిమిరేది !
ఏం వొయారం మీరమ్మది !
ఏం సోయగ మీరమ్మది !

ఏరు

అయ్య అరక దున్నుతూంటే పీర మేమ్మేం చేసేదో ?

వేణువు

సెనగపూలు తురిమీ - అవి
సిగపాయల పెట్టుకునీ,
సెనగకాయ చిదిమీ - అది
సిలిపిగ నోట్లేసుకునీ,
ఆవుకు నీ రెట్టేదీ !
ఆవుదూడ తోలేదీ !
ఏం సొగసో.........

ఏరు

ఊ రిక్కడ లేదుగదా - వా డిక్కడ లేదుగదా - ఒక్కత్తెకూ అయ్యతో ఊసుపోయేదో పీరమ్మకు ?

వేణువు

ఇల్లిదిగో - ఇటు జూడు - తోట కివతల. అక్కడుండేది అతగాడి కొంప.

ఏరు

ఎవరిదో ?

వేణువు

గోపయ్యది!

ఏరు

ఎవరో గోపయ్య?

వేణువు

కొండయ్య చేనులో పాలేరు.

ఏరు

కొండ య్యెవరో?

వేణువు

ఊరికంతకూ పెద్ద కామందు. బోలెడు కమత ముంది.

ఏరు

ఆఁ! చెప్పు చెప్పు గోపయ్య సంగతి!

వేణువు

గోపయ్యకు తల్లీ లేదు; తండ్రీ లేడు. మన వెదురు చువ్వలాగ ఉండేవాడు నిటారుగా, నీటుగా. సోగకళ్ళల్లో ఉండేది వాడి సోయగ మంతా. వాడి పెదవులకన్నా ముందు బుగ్గలు నవ్వేవి. బుగ్గలకన్నా ముందు కళ్ళు నవ్వేవి. వాడంటే అందరికీ వల్లమాలిన ఇష్టం. గోపయ్యకు వీరమ్మంటే కొండంత ఇష్టం.

ఏరు

ఇప్పు డిక్కడ డెక్కడా కనబడడే గోపయ్య?

వేణువు

తొందరపడకు. అక్కడ వీరమ్మ - ఇక్కడ గోపయ్య. పొద్దస్తమానం ఇవతల పడకండా ఉంటారా? ఎదరపడకండా ఉంటారా?

ఏరు

మరే! తోట పిలిచే, తోపు పిలిచే; చేను పిలిచే, గాలి పిలిచే!

వేణువు

మరే!

తోట కివల ఆమె యిల్లు!
తోట కవల వాని యిల్లు!
అటూ ఇటూ తిరుగుతూంటె
ఎదు రయేవి వాళ్ల కళ్లు!
ఏటి కాడ తోట కాడ
ఎప్పుడైనా వాళ్ల కళ్లు!
ఇటూ అటూ తిరుగుతూంటె
ఎదురయేవి!
ఎదురైనపు డాగి ఆగి
కదలబోవు వాని కళ్లు!
తప్పుకొని ఆమె కళ్లు
రెప్పల కిందికి మళ్లు!

కళ్లూ కళ్లూ కలిసి
నల్లకలవ మాల లల్లి!
అల్లి అల్లి మొగ్గలతో
ఝల్లనేవి వాళ్ల ఒళ్లు!

ఇలాగ క ళ్ళిద్దరివీ కలిసి కలవదండలు కడితే, నడుమనున్న బయలంతా ఇద్దరి నవ్వులూ పాకించేవి వెన్నెల తీగలు.

ఏరు

అవును మరి. పడుచు వయసులూ దుడుకు మనసులూ ఆయెను!

వేణువు

అలా అనకేం?

ఏరు

ఏమో?

వేణువు

పట్ట పగ్గా ల్లేనివి కావు వాళ్ళ గుండెలు; పట్టుతప్పినవీ కావు.

ఏరు

ఆఁ!

వేణువు

వాళ్లే సామంతులై పుడితేనా, వాళ్ళని పొగడడానికి నాలుగు మొగాల దేవుడు దిగి వచ్చేవాడు. వెయ్యినోళ్ళ నాగయ్య ఎక్కి వచ్చే వాడు.

ఏరు

కథ చెప్పు!

వేణువు

ఓనాడు గోవయ్య పిల్లంగోవి ఊదుకుంటూ చక్కా వచ్చాడు.

[దూరంనుంచి పిల్లంగోవి]........వెండిమువ్వల మొలతాడూ వాడూను! వచ్చి కూర్చున్నాడు ఆ పచ్చని మామిడి చెట్టునీడలో. నా పాట మాని వాడి పాట ఆలకిస్తూ ఉన్నాను. దూరాన్నుంచి వీరమ్మ కూడా వింది. విని, పాడుకుంటూ—

ఊరికే నా మనసు ఊగేనా! చూపు
లూరికే ఆ వైపు లాగేనా!

పుట్ట కాడ ఎవరో?
చెట్టునీడ ఎవరో? పాల
పిట్టకోస మీలయేస్తూ, పుంత
గట్టుదారి, పాము
పుట్టకాడ, మావి
చెట్టునీడ, ఎవరో? ॥పుట్టకాడ॥

అయ్య కూడు వండి పెట్టాలా!
పెయ్య మెళ్లొ మువ్వ కట్టాలా!
పిల్లగోవి పిలుపు వచ్చె - అది
చల్లగాలి మోసు కొచ్చె! ॥పుట్టకాడ॥

పోటు పాటు చూసుకొని
ఏటిరేవు దాటాలా!
ముళ్లు రాళ్లు చూసుకొనీ
మళ్లదారి నడవాలా!
పిల్లగోవి కబురు చేస్తే - ఎలా?
చల్లగాలి మోసుకొస్తే - ఎలా? ॥పుట్టకాడ॥

వీరమ్మ

యివ్వాళ అలిస్యెంగా వొచ్చే వేమో గోపయ్యా?

గోపయ్య

కాఁవందు పెద్ద కఁవతాని కంపించాడు. పనిచేసుకొని పరు గెత్తుకొచ్చా. అక్కడ కాఁవందుతో మాట్లాడుతూ మాట్లాడుతూ హఠాత్తుగా నోరుజారి నీ పేరన్నా.

వీరమ్మ

ఏమిటో నా పేరు? [నవ్వు]

గోపయ్య

ఏందు కన్నానోగాని, తెల్లబోయి, అప్పుడే పల్లకున్నా. ఎవరురా వీరమ్మ అని కొండయ్యదొర కోరగా చూశాడు.

[ఇద్దరూ నవ్వుతారు]

వీరమ్మ

నిజంగానే? నేను గట్టుకాడ నిలబడి, ఆవుదూడని 'గోపయ్యా' అని పిలిచా. అయ్య "అదేమిటి తల్లీ అస్తమానూ ఆ ధ్యాసేనా"

అని నవ్వాడు. [ఇద్దరూ నవ్వుతారు]....నాకు సిగ్గేసింది. "ఫరవా లేదు చిట్టి తల్లీ! వెళ్ళు. గోపయ్య కనిపెట్టుకుంటాడు" అని పంపాడు....ఈ కొబ్బరుండలు నీ కోసం తెచ్చా! ఇంద!

గోపయ్య

అన్నీ నా కెందుకూ? ఇద్దరం తిందాం. ఇంద - నువ్వు ఈ పువ్వులు తీసుకో!

వీరమ్మ

రోజు కో రకం పువ్వులు తెస్తావే!

గోపయ్య

మరి తే వొద్దూ? ఎక్కడ బడితే అక్కడ దొరికేవీ, ఎవరికి బడితే వారికి ఇచ్చేవీ బంతి పువ్వులు. నీకోసం అయితే ఏడురకాల పువ్వులూ తెస్తా - ఏడు సముద్రాలూ దాటైనా సరే, పాడు రాక్షసుణ్ణి చంపైనా సరే!

[ఇద్దరూ నవ్వుతారు]

వీరమ్మ

కతల్లో ఏడువారాల నగల్లాగా!

గోపయ్య

అవును. నీ కోసం ఏదైనా చేస్తాను.

వీరమ్మ

నేనూ అంతే! మా అయ్యతరవాత నువ్వే నాకు!

గోపయ్య

నాకు అయ్యా అమ్మా లేరుగనక అన్నీ నువ్వే !

వీరమ్మ

నువ్వలా అంటే ఏడుపొస్తుంది నాకు. నాకు మాత్రం ? నిద్దరో తున్నప్పుడు కూడా కల్లో కొచ్చి—

గోపయ్య

మేలుకున్నప్పుడు వెనకాలే నడిచిన ట్టుండి -

వీరమ్మ

అలికిడైతే ఉలికిపడి, గుమ్మందగ్గిరికి పరుగెత్తుకొచ్చి -

గోపయ్య

అడుగు చప్పుడైతే, గుండె గొంతుకులో కొచ్చి -

వీరమ్మ

నిజమే సుమా ! వెయ్యి అడుగుల చప్పుళ్ళలో ఇష్టమైన వాళ్ళని ఇట్టే పసికట్టవచ్చు. అయ్య అడుగులూ నీ అడుగులూ మరీని.

గోపయ్య

మరి వీట్లలో తేడా ?

వీరమ్మ

అయ్యవి - "అమ్మా ! నే నొస్తున్నానురా ! నీకేం ఫరవా లేదు" అన్న ట్లొస్తాయి. నీవి- "త్వరగా ఎదురురా ! ఎంతసేపు కని పెట్టి ఉండను" అన్న ట్లుంటాయి. అవునా ?

గోపయ్య

ఇలా ఇక్కడ కూచోగూడదో దగ్గరగా!

వీరమ్మ

తప్పుకాదూ ఇప్పుడు!

గోపయ్య

అవును. అందుకోసమే నీ మీద అంత యిష్టం నాకు.

[దూరంనుంచి కెంకేటుకు గొంతు వినబడుతుంది.]

"అమ్మా వీరమ్మా! ఇంక ఇంటికిరా! చీకటి పడుతూంది."

వీరమ్మ

నే వెళ్ళొస్తా!

గోపయ్య

మంచిది.

[అడుగుల చప్పుడు. పిల్లంగోవి దూరంగా వాయిస్తూ పోతాడు.]

వేణువు

ఇలా కలుసుకునేవారు వీరమ్మా గోపయ్యా! ఇలాగ ఊసులాడుకునేవారు. వీరమ్మా గోపయ్యా! ఎప్పుడూ ఇలా నా నీడలోనే కూచుని. ఎప్పటికైనా నా నీడలోనే వీరమ్మా గోపయ్యా మేడ కట్టుకోవాలని నా కుండేది.

ఏరు

ఊరూ వాడా ఏమనుకునేవారో? పసివాళ్ళకి తెలియదుగదా. బయలంతా కనిపెట్టే కళ్ళే ఉంటాయని!

వేణువు

ఊరూ వాడా, పిన్నా పెద్దా, ఎవ్వరికీ ఈసు లేదు - రోసం లేదు - వీరమ్మా గోపయ్యా అంటే. నాకూ ఉండేది. వాళ్ళ పెళ్ళికి పందిర అవాలని. ఓనాడు జోడెద్దుల బండిలో గడ్డీగాదం వేసుకుని - అల్లదిగో - ఊరికివతల ఆ బావిపక్క పుంతబాటలోనుంచి, వెంకటేశు వెడుతున్నాడు -

[నీళ్ళు తోడుతూన్న చప్పుడు. బట్టలు ఉతుకుతూన్న చప్పుడు.]

ఉండబట్టలేక అక్కడ చేరిన అమ్మలక్కలు -

"ఓ యెంకటేశూ! యెంకటేశూ!

యీరమ పెళ్లెపుడయా? నీ కూతురు పెళ్లెపుడయా?

యినబడవా నా మాటలు యెడ్లమువల సప్పుళ్లో?
యినబడవా నా మాటలు! యెండిమువల సప్పుళ్లో!
యీరమ పెళ్లెపుడయా? యెంకటేశూ! యెంకటేశూ!"

"నీకెందుకె ఆ ఊసు? నీ కూతురు కామోసు!"
"నే సెప్పేదా లగ్గంనాడు పెళ్లి -" "శాబాసు"
"యెంకటేశూ! యెంకటేశూ!

యెండిమువల సందట్లో యినబడదు కామోసు!
యేటి అలల సందట్లో యినబడదు కామోసు!"
"పిల్లలున్నా తల్లి గనక పెద్దమ అడిగింది -
తల్లిలేని పిల్లగనక దయతో అడిగింది -"
"ఇదివరకే జరిగింది యీరమ్మకు పెళ్లి!
యీరమ్మకు గోపయ్యకు - యీశ్వరుడే సాక్షి!"
"మల్లెతీగకూ మావిడి చెట్టుకు పెళ్లెపుడోయీ యెంకటేశూ?
అల్ల సుక్కకూ జాబిలికీ పెళ్లెపుడోయీ యెంకటేశూ!"

ఒక ఆడగొంతు

ఊరికే పలక్కుండా వెళ్ళిపోయాడూ!

ఇంకోగొంతు

పిల్లకి పెళ్ళి చెయ్యాలని లేదేమో!

మరోగొంతు

ఇంట్లో వండిపెట్టేవాళ్ళు లేక పిల్లని అట్టే పెట్టేశాడు.

వేరే గొంతు

గున్న మావిడిలాగ పెరిగి కూచుంది పిల్ల! తాను కిమ్మనడు.

ఇంకోగొంతు

వెంకటేశు నలా అనకేం! పిల్లకి పెళ్ళి చేస్తేమాత్రం. ఎక్కడి కెడుతుంది?

మరోగొంతు

అవును మరి! గోపయ్యకుమాత్రం ఎవరున్నారు? తండ్రీ కూతురూ అల్లుడూ కలిసుంటారు.

ఇంకోగొంతు

ఏదో అన్నాను - వాళ్ళిద్దరి పెళ్ళి కళ్ళారా చూస్తానో లేదో అని!

వేణువు

ఏమో మరి! వీరమ్మను వాడు చూడకపోయినా, వాడి మన స్సులో దూరింది మరి!

ఏరు

ఎవరి మనస్సులో?

వేణువు

కొండయ్య మనస్సులో. వాడు వెనక ఎప్పుడో పుడితే, రావణాసురుడు అయి ఉండేవాడు. వాడి అందానికి తగిన గుణం, గుణానికి తగిన అందం. వాడిచూపు గొంగళీ పురుగులా ఉంటుంది. వాడి నవ్వు తేలు కొండిలా ఉంటుంది.

ఏరు

అమ్మ బాబోయ్!

వేణువు

ఆచూకీ తీశాడు వాడు వీర మ్మెవరో! బయలుదేరి ఇటొ స్తున్నాడు. కూనరాగం తీస్తూ ముక్కుతో. వాడిపాట కూలా! నా గుండె గుభేలుమంది. వా డొస్తున్నాడని నే నరిచరిచి చెప్పాను వీరమ్మతో-

ఏరు

అమ్మయ్యో! నాకు ముచ్చెమటలూ పోస్తున్నాయి.

వేణువు

వొస్తున్నడూ! కొండ య్యొస్తున్నడూ!
వొస్తున్నడూ! దొర వొస్తున్నడూ!
ముస్తాబు చేసుకొని వస్తాదులా!
రంకె వేస్తు అచ్చోసిన ఆబోతులా,
జంకు లేక కారు నల్ల యెనుబోతులా!
వంకర మీసాల్ రెండు రెండు చేతులా
తిప్పుకొంటు, రొప్పుకొంటు, చీంబోతులా
వొస్తున్నాడూ!
అంగలేసు కొస్తుంటె రాకాసిరా!
దొంగచూపు చూస్తుంటె దోబూచిరా! వాడి
దొంగచూపు చూస్తుంటె
నంగి నవ్వు చూస్తుంటె -
బెంగేసు కొస్తుంది - పిశాచిరా!
వొస్తున్నాడూ!
బంతిపూలు భామకోసం తెస్తున్నాడూ - నే
మంతిపూలు మగువకోసం తెస్తున్నాడూ - ఆ
దొంతర పళ్లేసుకొని
లాంతర కళ్లేసుకొని
జంతికలూ జీళ్లు పట్టుకొస్తున్నాడూ! వొస్తున్నాడూ!

వాడిల్లు వల్లకాడు గానూ! వాడు నా నీడలోనే చతికిలబడ్డా డిక్కడ. పెళపెళ్ళాడే గంజిమడతలు తలకూ మొలకూ కట్టుకొని, కిర్రు చెప్పులూ పొన్నుకర్రా తానూ ఇక్కడే రెడ్డిగం వేసుకున్నాడే! వేసుకొని, ఏదో మొరగడం మొదలెట్టాడు.

కొండయ్య

ఇక్కడ బైరాయిస్తా! ఏదీ పొగాకు? ఆ! రొండిలో ఉంది. ఈవేళ మూరెడు చుట్ట ముట్టిస్తా....పప్పప్ప! [చుట్టకాల్చిన చప్పుడు] ....చూద్దాం. గోపిగాడికోసం వచ్చేవేళయిందేమో! మనకి పిల్లం గోవి ఊదడం చేతకాదే! ఈలపాట కాస్త వచ్చు. ఓ మాటు మరి డమ్మ జాతరలో కత్తిసాముకాడ ఈలపాట పాడేను. అందరూ - "ఊరుకో! అమ్మవారికి తలనొప్పొస్తుం" దన్నారు....ఆ! ఆ! అదిగో! ఆ పిల్లే! ఆ పిల్లే- తప్పదు. ఆ మలుపుకాడ చెట్లల్లో నిల బడితే, మేగంలో మెరు పనుకున్నా. చెట్లాకుల సందుల్లోంచి జారే వెలు గనుకున్నా! మల్లెతీ గనుకున్నా! మామిడికొమ్మనుకున్నా! ఏదైనా అనుకున్నా! బలేపాట పాడుతూ వచ్చేస్తోంది. రానీ! రానీ!

వీరమ్మ

[పాట అంతకంతకు దగ్గరగా]

పెరటిలోని గన్నేర! పెదిమి విరిచి నవ్వేవు!
కోరడిలో గోరింట! కోపగించి చూసేవు!
తెలుసా నాగుట్టు?

నలుగురికీ చెప్పే_స్తే నా మీదే ఒట్టు!
ఒట్టు సుమీ! ఒట్టు!
నా లోపల పచ్చనాకుల గూడుంది - తెలుసా?
ఆ లోపల పంచవన్నెల చిలకుంది - తెలుసా?
పచ్చనాకుల గూటిలోన
పంచవన్నెల చిలక
పంచవన్నెల చిలకపై నా ప్రాణమంతా తెలుసా?
॥తెలుసా నాగుట్టు॥

ఏరు చూడని వేళల బం
గారుచిలకను పైకి తీస్తా!
చేరి చెవిలో ఊసు లేవో
చెప్పుకుంటా తెలుసా?

గూటినుంచీ రామచిలకను
దాట నివ్వను తెలుసా?
దాటి పోతే కూటి నొల్లను
ప్రాణ మొల్లను తెలుసా? ॥తెలుసా నాగుట్టు॥

కొండయ్య

ఎవ రమ్మాయ్ నువ్వు?

వీరమ్మ

వెంకటేశు కూతుర్ని.

కొండయ్య

ఏ వెంకటేశు? వల్లపువేను వెంకటేశా?

వీరమ్మ

అవునండి!

కొండయ్య

ఆఁ! పేరు?

వీరమ్మ

వీరమ్మ!

కొండయ్య

ఛళ్! వీరమతి అనాలి.

వీరమ్మ

కాదు. వీరమ్మే నండి!

కొండయ్య

నీ యిష్టం. చూడు! ఇలా కూర్చో!

వీరమ్మ

వొద్దండి! ఇక్కడే నిలబడతా.

కొండయ్య

అ! అ! ఇదేమిటి! చిత్రం వీరమ్మా!! (వెకిలిగా నవ్వుతూ) నువ్వొస్తావని తెలిసున్నట్టు - ఇవిగో - అహ్హహ్హహ్హా! ఇవి బంతి పూలు - ముద్ద బంతిపూలు. సరి. ఇవిగో - ఈ సంచీలో జంతికలూ జీళ్లూ కూడా ఉన్నాయే! [నవ్వుతూ] తీసుకో! వీరమ్మా! నువ్వే తీసుకో!

వీరమ్మ

నా కక్కరలే దండి!

కొండయ్య

ఛెస్! అదే మన్నమాట! తప్పు లేదు. ఇక్కడ వెంకటేశే ఉంటే, వి న్నలా అన్నిచ్చేవాడా? ఊఁ! తీసుకో మరి! [నవ్వుతూ] ఇప్పుడు తినక్కర లేదులే! పువ్వులుమాత్రం ఇప్పుడే పెట్టుకోవాలి. [గారాంగా] ఊఁ -

వీరమ్మ

పెట్టుకోనండి!

కొండయ్య

అవా! అయితే, నేనే - కొప్పులో నేనే ఉంచాలన్నమాట! వెంకటేశు కూతురుతో వే నా మాత్రం చనువు తీసుకోవచ్చు.

వీరమ్మ

వీ ల్లేదండి!

కొండయ్య

పోనీలే!

[దూరంనుంచి పిల్లంగోవి పాట]

కొండయ్య

అదెవరు?

వీరమ్మ

గోపయ్య!

కొండయ్య

ఎవరో ! నే వెళ్ళొస్తా నమ్మాయ్ ! వెంకటేశుతో చెప్పు - నే నడిగానని....[కిర్రుచెప్పుల జోళ్లు - వెళ్ళిపోతూన్నట్లు]

వేణువు

కొండయ్య వెళ్ళాడు: గోపయ్య వచ్చాడు. గోపయ్యా, వీరమ్మా కూర్చుని, కొండయ్య ఇచ్చిన జంతికలూ, జీళ్లూ తిన్నారు.

ఏరు

తినకుండా ఉండవలసింది.

వేణువు

పాపం ! వాళ్ళ కేం తెలుసు, వాడి కుసిద్ధం ? నీలాగా నాలాగా పెరిగారు వెర్రివాళ్ళు. వాడు వొదిలిన పువ్వులుమాత్రం పెట్టుకోలేదు వీరమ్మ. గోపయ్య తెచ్చిన గోరింటలు తురుముకుంది కొప్పులో. దూరాన పొదచాటునుంచి చూస్తూనే ఉన్నా డా రావణాసురుడు.

ఏరు

వాడి వొళ్ళు మండిపోను !

వేణువు

నిజంగా ఒళ్ళు మండిపోయి, కిర్రు చెప్పులజోడు మరీ కిర్రు మంటూంటే, ఊరివైపు దారితీశాడు.

ఏరు

ఏమిటో బాబూ ! భయం వేస్తుంది ఈ కథ వింటూంటే !

వేణువు

ఆలోచించాడు. ఆలోచించాడు. ఓనాడు ఒక ఎత్తెత్తాడు కొండయ్య. గోపాలానికి కబురంపాడు.

కొండయ్య

గోపాలం! అల్లమా పెద్ద కమతం దగ్గిర పని బాగా జరగడం లేదు. రామయ్యగాడిమీద నాకు నమ్మకం లేదు. అక్కడికి నువ్వుపోయి. పొలంలో పాకలో మకాంపెట్టి. పనీ పాటా కనిపెట్టుకుని చూస్తూండు.

గోపయ్య

నే నెందు కయ్యా?

కొండయ్య

ఆఁ ఆఁ! అలా కాదు. నాకు నమ్మకస్తు డుండా లక్కడ. నే నెప్పుడో వచ్చి చూస్తా నంతే. ఏఁ వుంది? నూర్పు లయ్యాక నువ్వూ వచ్చేస్తావు. నడు. ఈవేళే బయలుదేరు. ను వ్వాకగడియలో అక్క డుండాలి. రామ య్యప్పుడే వొచ్చేశాడు కూడా.

ఏసు

అమ్మయ్యో! ఎంతెత్తు ఎత్తాడో!

వేణువు

పాపం! పీరమ్మతో చెప్పడానికైనా వీ ల్లేనంత తొందరలో, కొండయ్య కమతానికి పరుగెత్తాడు గోపయ్య. నే నప్పుడు వెళ్లొద్దని ఎలా మొరబెట్టు కున్నా ననుకున్నావు!

తుమ్మెదా! తుమ్మెదా! తుమ్మెదా!
ఊరెళ్ళి పోతావ? తుమ్మెదా!

దూరాలె పోతావ? తుమ్మెదా!
ఊరెళ్ళి పోతావ? దూరాలె పోతావ?
తుమ్మెదా! తుమ్మెదా! తుమ్మెదా!

వన్నెల్ల చిలకనూ తుమ్మెదా!
వదిలేసి పోతావ? తుమ్మెదా!
వన్నెల్ల చిలకనూ వదిలేసి పోతావ? తుమ్మెదా!

మళ్ళీ వచ్చేలోగ తుమ్మెదా!
వెళ్ళీ వచ్చేలోగ తుమ్మెదా!
మళ్ళీ వచ్చేలోగ వెళ్ళీ వచ్చేలోగ తుమ్మెదా!
ఏమైపోతాదో తుమ్మెదా!
ఎళ్ళొద్దు ఎళ్ళొద్దు తుమ్మెదా!
ఏమైపోతాదో ఎళ్ళొద్దు! ఎళ్ళొద్దు! తుమ్మెదా!
చెట్టగాలీ వీస్తై తుమ్మెదా! గూటి
పిట్టే మౌతాదో తుమ్మెదా!
చిలకే మౌతాదో? మొలకే మౌతాదో?
యెళ్ళొద్దు యెళ్ళొద్దు యెళ్ళొద్దు!

ఏరు

వినిపించుకోకుండా వెళ్ళిపోయాడా?

వేణువు

ఆఁ! వెళ్ళనూ వెళ్ళాడు. ఇంతలో కుప్ప నూర్పు లొచ్చాయి. వెంకటేశు పనిచేస్తున్న పొలంలో కుప్పలు నూరుస్తున్నారు.

(నూర్పుల పాట)

ఎద్దులైతే తొక్కేశాయీ! యెన్నెలా పొద్దు గెక్కేశాయీ!
దున్నలైతే తొక్కేశాయీ! దిన్నెలా పొద్దు గెక్కేశాయీ!

పొలియో! పొలియో! పొలియో!
వొలియో! వొలియో! వొలియో!

రార పైరగాలి దారీ స్వారి చేస్తూ! ॥పొలియో పొలియో॥
పొలి పొలి పొలి పొలి పొలియో!
వొలి వొలి వొలి వొలి వొలియో!

గలగల సందల కులుకులో - తళతళ అందెల తళుకులో
పిలిచిన పరువున బిరబిర తొరతొర
రావయో! రావయో! ॥రార పైరగాలి దారీ॥

కామమ యెత్తే పళ్ళక - రామయ పట్టే పళ్ళక-
గాలికి ఎదురుగ ఎత్తితే, వాలుగ వీలుగ ఎత్తితే,
రాలెను నేలకు జలజల జలజల
రాసులూ! రాసులూ!

వేణువు

వీరమ్మ వేపచెట్టు నీడలో వెల్లావుమీద ఒరిగి. వింటూ విలు చంది - నూర్పుల పాట. అంతలో గోపయ్యమాట మనస్సులో

కొచ్చిందో ఏమో, ఇటువైపు వచ్చేస్తుంది. ఇక్కడి కొచ్చాక, ఆ గుట్ట వెనకాల పొంచున్న కొండయ్య, అప్పుడే తాను వచ్చినట్టు, ఎదురుగా నిలబడ్డాడు.

కొండయ్య

ఏం వీరమ్మా!

వీరమ్మ

ఏఁవండి?

కొండయ్య

[కొంచెం నవ్వుతూ] ఇవ్వాళ నువ్వొస్తావని వచ్చాను తెలుసునా? నీ కోసమే!

వీరమ్మ

అదేఁవిటండి?

కొండయ్య

ఇవి చూడూ! పనిగట్టుకుని, పట్నాని కెళ్ళి, పంచదార లడ్లూ పట్టుచీరే పట్టు కొచ్చాను. ఛెస్! నువ్వలాంటి ముతకచీర కట్టుకోవడమా? ఛెస్!

వీరమ్మ

నా కదే ఇష్టమండి!

కొండయ్య

ఓ సారి మనిద్దరం మన సవారీ బండిలో పట్నాని కెళ్ళాలి. వెళ్ళి, అక్కడి అమ్మాయిలనందర్నీ చూశాక నువ్వలా అనవు.

వీరమ్మ

అవేం మాట లండి? మా అయ్యవస్తే వస్తా!

కొండయ్య

సరేలే! చూద్దాంగాని! ఈవేళ ఈ పువ్వులమాత్రం నేనే నీ కొప్పులో పెట్టాలి. ఈ లడ్లు నేనే తినిపించాలి. [నవ్వుతూ] నేను కొరి కివ్వనులే! నువ్వే కొరి కియ్యి!

వీరమ్మ

చాల్లెండి!

కొండయ్య

ఇవాళ అలా వీలులేదు.

వీరమ్మ

దగ్గరగా రాకండి!....ఛీ! ముట్టుకోకు, ఫో!

కొండయ్య

హుష్! మాట్లాడకు. ఇక్కడెవరూ లేరులే!

[కొండయ్య కసురు కాట్లూ – "అయ్యో అయ్యో", "గోపయ్యా" అని వీరమ్మ కేకలూ వినబడతాయి. పెద్ద ఈదర గాలీ, ఈదరగాలి ఈలలూ, దూరాన ఉరుములూనూ]

వేణువు

[గట్టిగా] ఇంకేముంది? ఆ ఘోరం చూసి, నా గుండెలు పెల్లగించుకు పోయాయి. భూమిని బద్దలు చేసుకుని, నా మొలకలు బల్లేల్లాగా పైకి దూసుకువచ్చి నిలుచున్నాయి. ఎన్నాళ్లగానో నాలో

కాపురమున్న నాగేంద్రుడు, బుస్సుమంటూ పైకి దూసుకునివచ్చి, కొండయ్యని కా టందుకున్నాడు. ఇంతలో ఫెళఫెళా ఫెళఫెళామని ఆకాశం బద్దలైంది. ఒక మెరుపు మెరిసి, కళ్ళు విప్పి చూతునుగదా-మన వీరమ్మ కట్టెలా పడి ఉంది, పిడుగు పాటుకి. మరొక చిటికెలో వెంకటేశు వచ్చి, కన్న బిడ్డమీద పడిపోయాడు -

ఏరు

[ఏడుస్తూ] వొద్దు వొద్దు! ఇంక వినలేము.

వేణువు

నేను చెప్పనూ లేను. ఆ చిన్నితల్లి తండ్రి వెంకటేశు -

అయ్యో అని యేడ్చెను - ఇటు
లయే నని ఏడ్చెను!

ఆ బంగరు బొమ్మకోస మలవికాని దుఃఖంతో,
అలవికాని దుఃఖంతో, ఆ మూసిన చీకట్లో -

అయ్యో అని ఏడ్చెను....

కొన ఊపిరి ఉందేమో! ముకుపుటముల వేలుంచి,
కొంతవేడి కల దనుకొని, కూతుమేన చేయుంచి,
గుండెపైన చెవియుంచి, మోమున మో మానించి,
కుమిలి కుమిలి కుళ్ళి కుళ్ళి గోలుగోలు మని ఏడ్చెను-

అయ్యో అని ఏడ్చెను....

ప్రాణ మెదలి పడిఉన్నా ప్రాణమైన తన కూతురు
చూసి చూసి చూడలేక, చూడలేక చూసి చూసి,
ప్రాణ మిచ్చి తన పట్టిని బ్రతికించనె లేనని
కుమిలి కుమిలి కుళ్ళి కుళ్ళి గోలుగోలుమని ఏడ్చెను-

అయ్యో అని ఏడ్చెను....

తన్ను చూసి తా నేడ్చెను, తా నేడ్చెను తోట చూసి,
తోట చూసి తన్ను చూసి గూటగూట పులు గేడ్చెను-
చిన్నితల్లి ఇక మసలని చీకటింటి కేసి చూసి
కుమిలి కుమిలి కుళ్ళి కుళ్ళి గోలుగోలు మని ఏడ్చెను-

అయ్యో అని ఏడ్చెను....

కన్న బిడ్డ మనసులోన ఎన్నికోర్కె లుండేవో!
చిట్టికి ఈ బతుకంటే ఎట్టి ఆశ లుండేవో!
తలచి తలచి తలవలేక, తలవలేక తలచి తలచి,
కుమిలి కుమిలి కుళ్ళి కుళ్ళి గోలుగోలు మని ఏడ్చెను-

అయ్యో అని ఏడ్చెను....

[అందరూ ఏడ్చే ధ్వనులు]

కవి

తుదిదాకా ఆ కన్నియ కథ ఎలాగ చెప్పిందో -
వెదురు వెదురు కణుపు కణుపు వెక్కి వెక్కి
యేడ్చెను!



కథ తుది వచ్చేసరికీ కరిగిపోయి కరిగిపోయి
పొదను చూసి ఏ రేడ్చెను-పొద ఏడ్చెను ఏటి జూసి...

[క్షణం నిశ్శబ్దం......పొడుగాటి నిట్టూర్పు...పూర్తిగా నిశ్శబ్దం]

కవి

అల్లదిగో! ఆ పుంతమలుపున. ఆ తోపు వెనకాల, తొంగి చూసే గుడి చూశావా? అందులో వీరమ్మ కన్నెపేరంటాలు దేవతై వెలిసింది. ఈ గ్రామంలోని కన్నె లందరినీ ఆ వీరమ్మే కాపాడు తుంది. ప్రతి మాఘ పున్నమికీ వీరమ్మ పేరంటాల్ని ప్రజలంతా పసుపు కుంకంలో ఓలలాడిస్తారు.

ఒక గొంతు

గోపయ్యే ఏమయాడో!

కవి

ఏమో! వేణుకుంజం ఏటితో చెప్పలేదు.